**ALLAH MAALIK (TELUGU) BY VAACHASPATHY**

ఓం సాయి శ్రీ సాయి జయ జయ సాయి

**సదా సత్స్వరూపం చిదానంద కందం**

**జగత్సంభవస్థాన సంహార హేతుమ్ |**

**స్వభక్తేచ్ఛయా మానుషం దర్శయంతం**

**నమామీశ్వరం సద్గురుం సాయినాథమ్ ||**

# అల్లాహ్ మాలిక్

(శ్రీ సాయిసద్గురు శతకము – లఘుటీకా సహితము)



వాచస్పతి

ॐ

|| ఓం శ్రీ దత్తాయ గురవే నమః ||

||ఓం శ్రీ సమర్థ సద్గురు సాయినాథాయ నమః ||

||ఓం పూజ్యశ్రీ ఆచార్య ఎక్కిరాల భరద్వాజాయ నమః ||

ఓం సాయి శ్రీసాయి జయ జయ సాయి

# అల్లాహ్ మాలిక్

*(శ్రీసాయిసద్గురు శతకము – తెలుఁగు)*

*లఘుటీకా సహితము*

*రచన : 'వాచస్పతి'*

*హైదరాబాద్.*

*2015*

**ALLAH MAALIK** (Telugu) – An Anthology of Devotional Verses addressed to Lord Sri Saibaba of Shirdi

**By 'VAACHASPATHY'**



**First Published (Present Edition) :** February 2015.
By Sri Sai Raghavendra Vaastu Jyotishalayam
HYDERABAD.

**PRICE :** Rs.75 (Rupees Seventy Five only)

ॐ

|| ఓం శ్రీ దత్తాయ గురవే నమః ||

||ఓం శ్రీ సమర్థ సద్గురు సాయినాథాయ నమః ||

||ఓం పూజ్యశ్రీ ఆచార్య ఎక్కిరాల భరద్వాజాయ నమః ||

# అల్లాహ్ మాలిక్

*(శ్రీసాయిసద్గురు శతకము ; రచన:- 'వాచస్పతి')*

**శ్రీకర సత్యతత్త్వ సర**
**సీ విహరద్వరరాజహంస! ఆ**
**ర్తాకుల వాంఛితార్థి జన**
**తార్పిత హార్దిక సుప్రశంస! స్వీ**
**యాకలుషేతిహాస పర**
**నైక పరాయణ సుప్రసన్న! ప్ర**
**జ్ఞాకలిత ప్రపన్న సుమ**
**న స్సుమనస్తరు! సాయిసద్గురూ!** 1

ఉ. నిన్ను నధఃకరించు మహనీయగురుండు, వినీత భక్తిసం
పన్నత మించు శిష్యుఁడు, స్వభక్తజనావనమందు వ్యగ్రుఁడై
మిన్నయినట్టి వేల్పు, నిను మించిన మానవవాదమూర్తి తా
రెన్నఁగ నీ వసుంధరను లేరు నిబద్ధిగ సాయిసద్గురూ! 2

చ. వివిధములైన వర్ణములు వేఱు గణాంకములందు మిశ్రమై
కవసిన నెన్ని వర్ణములు గల్గనొ యన్ని సమాహ్వయంబు లు
న్నవి గద నీకు! నీ భువన నాటక భూమికలందు భేదముల్
వివరణ సేయఁగా వశమె విజ్ఞులకైనను సాయిసద్గురూ! 3

ఉ. కూఱిమి నిన్ దలంచు పలుకుల్ పొఱఁబాటయినన్ నిజం బపో
చ్చారణ దోషజుష్టమని చాటుట సాహసమౌను గాదె? యిం
పారఁగ 'సర్వవేత్త' యని పల్కక యొక్కఁడు 'పర్వవేత్త' గాఁ
బేరుకొనన్ ద్వదీయగుణభేదమె యౌఁ గద సాయిసద్గురూ! 4

చ. తెలియఁగ వచ్చు నీ యుపకృతిప్రకరంబునకే సవిస్మయం
బులగుఁ బ్రపన్నచిత్తములు ; బుద్ధికిఁ దోఁపని మారుమూలలన్
బలువిధమైన జీవులకు బాధలు దీర్చి కృతజ్ఞతాదికం
బు లడుగకే యదృశ్యమగు పూజ్యుఁడవీవయ! సాయిసద్గురూ! 5

ఉ. మీ విపులాత్మమానస మమేయము ; దాన ననేక విశ్వ జీ
వావళి పేరుపేరున వివాదము లేక నివాసముండు ; మా
భావములీ మహామహిమభంగులెఱుంగవు గాన మా వలెన్
నీవును విస్మరింతువని నిందలు వైతుము సాయిసద్గురూ! 6

ఉ. చూపులకింపు నీ సుభగ సుందర శుభ్ర శుభాంగ విస్ఫుర
ద్రూపము, సర్వ సద్భువన రూఢము, స్థావర జంగమాత్మకం,
బా పయి నీ వచోఽ మృతము లాగమ సన్నిభముల్ ; నిజంబు నీ
స్వాప హితప్రవాకములు శాసనముల్ భువి సాయిసద్గురూ! 7



చ. శిశువులతో శిశుత్వమున, సిద్ధులతోఁ బరమాత్మసిద్ధుఁడై,
పిశునులతోఁడఁ బ్రోడవయి, పెద్దలతోఁ గడుమించు పెద్దవై
విశదమనీష ని న్నెటుల వేఁడిన నట్టులె వారిఁ బ్రోచు నీ
కుశలత దివ్య మద్భుతము గోప్యతమం బిల సాయిసద్గురూ! 8

ఉ. మానుపుమన్న జబ్బులను మానుపుచుంటివి, తీర్పుమన్న వాం
ఛా నివహంబుఁ దీర్చెదవు, సంపదలిమ్మన నిచ్చుచుంటివీ,
వైనను నిన్ను మోక్షమున కడ్గినయంత నొసంగ, వస్మదీ
యానుచితాత్మవాసనల యావరణంబున సాయిసద్గురూ! 9

ఉ. నీ కలరూపు నిత్యమగు ; నేనొ? యనిత్యము ; నేను లేను, నీ
వే కల, వెల్ల నీదె, యణువేనియు లేదు మదీయ, మీవ స
త్యాకృతి, వే నబద్ధమను ; దథ్యశరీరివి నీవు, నేను ఛా
యాకృతి నీకు సర్వశరణాగతుఁడ న్నిఁక సాయిసద్గురూ! 10

చ. తెఱచిన పుస్తకాల వలెఁ దేఁటలు మాదు మనోగతాలు నీ,
కఱచి వచింపనేల బహుకష్టసుఖంబులు మానసవ్యథల్?
మఱవక నీదు ధ్యానమున మగ్నులమై మనుచుంటిమేని మా
యెఱుకకు రాకముందరె దహించెద వాపద సాయిసద్గురూ! 11

ఉ. నీ యనుకంప యెంతటిదొ నిక్కముగాఁ దెలిసెన్ జరిత్ర పా
రాయణ మొక్కసారి మొదలైనపు డెట్టెదుటేఁగుఁదెంచి నీ
చేయి మదీయ శీర్షమునఁ జేఱిచి దీవనలిచ్చినప్పుడే ;
యా యనుకంపనే పఱపుమా కడ దన్కను! సాయిసద్గురూ! 12

ఉ. కొల్లలు క్రొత్తశాస్త్రములుఁ , గుప్పల కొద్ది విదేశవాసనల్
మెల్లనఁ జొచ్చి యీ ధరణిమీఁది జనంబుల యాస్తికత్వమున్
డుల్లఁగఁజేయుచుండ భవదుద్భవమ్మై మఱలన్ దృఢంబుగా
నల్లుకొనెన్ బరార్థమున నమ్మకమెల్లెడ సాయిసద్గురూ! 13

ఉ. నమ్మిక నీ కనన్యముగ నాశ్రితులై మనసుంచి యార్తితో
"ర"మ్మని చీర నీవెపుడు "రా"నన, వేదియొ యొక్క రూపునన్
సమ్ముఖ మేఁగుఁదెంచెదవు, స్వప్నమునన్ గనవత్తు, వక్కణన్
నెమ్మి వచింతు, వక్కటిక నీ కెవఱీడిల? సాయిసద్గురూ! 14

ఉ. కేవల తత్త్వదర్శివని క్రేణి యొనర్చుట సాధ్యమే? స్వయం
దేవుఁడు గాక కోట్ల కొలఁ దిజ్జగతీ జనజాతి వేఁడు సం
భావన లిచ్చు టెవ్వఱికి భావ్యము? మానవమాత్రుఁ డోఁపునే?
దైవత పంక్తికే తమఱు దైవత మారయ సాయిసద్గురూ! 15

ఉ. తోరములౌ ప్రచారముల తోఁడను గ్రంథ సభోపదేశ సం
భారము తోఁడ నీ పథముఁ బట్టినదెవ్వఱు చూడ? భక్త సే
వా రతి నీవె యేకజన వాహినివై ప్రతియిల్లు మెట్టి క
న్నీరులఁ దుడ్చి నీయెడల నిష్ఠఁ గఱంచితి సాయిసద్గురూ! 16

ఉ. మూలము దేవులాడు బహు మూర్ఖజగత్తిది గాన నీవు మా
మూ లవధూత వోలెఁ దపముల్ గురుసేవలటంచుఁ బల్కుటల్ ;
వేల శరత్తు లాయువున విష్ణు మహేశ చతుర్ముఖాంశలన్
గ్రాలెడి నీవు మాకును బరాత్ముఁడ వంతయె సాయిసద్గురూ! 17

ఉ. బ్రాంతిగ దేవతా జనన భంబులఁ దేల్చెడువారు, దేవతా



జాతకముల్ విషాదమని సంతున కయ్యభిధానముంచుటన్
ఱోఁతగ నెంచువార్ పలువుఱుండెడు దేశమునందు నిన్ మురా
రాతిగఁ జూడలేని జను లక్కజకారులె? సాయిసద్గురూ! 18

ఉ. నీవె నవగ్రహావళివి, నీవె సమస్త పురావతారముల్
నీవె ఫలప్రదాత వవనీజన కర్మల కీవె ధాతవున్,
నీవె కృతాంతుఁడౌ నిధన నిర్ణయమందున, నీవు సర్వ సం
భావిత చక్రవర్తివి తపస్వుల కెల్లను సాయిసద్గురూ! 19

ఉ. దేహము నుజ్జగించియుఁ దదేక దయార్ద్రత మై స్వభక్తులన్
బాహిర లోక కష్టముల బారినఁ గూలనియట్లు కాఁచుచున్
స్నేహముతోఁడ ధార్మిక విశేష పథంబుఁ గఱంచు నీకు దీ
టైహిక లోకమందుఁ గననౌదురె లాఁతులు? సాయిసద్గురూ! 20

ఉ. అక్షత లింకఁ దీర్థజల మాగమ బోధిత మంత్రసూక్తముల్
లక్షణమైన తంత్రముల లంపయు నీ కనవశ్య మేరికిన్
రక్షణమివ్వఁగోరిన ; బరాత్పర! నీ ముఖ నిర్గతోక్తి ది
వ్యాక్షి విలాసముల్ జనుల కండగ నిల్చును సాయిసద్గురూ! 21

ఉ. ఆయురనామయత్వములు నైశ్వరమున్ నిజభక్తకోటి కం
దీయఁ బరేతవల్లభ విధీంద్ర సుధాబ్ధికుమారి సమ్మతుల్
వే యనవశ్యముల్ దమకు; స్వీయ కృపామయ దృక్ ప్రసారమే
సాయముగాఁ జరించు పురుషాకృతు లీరిల సాయిసద్గురూ! 22

ఉ. కోటిశరత్సమూహమున కొక్కటియో మఱికాక లక్షకో
లోటుగ నూర్ శతాబ్దములలోననొ యొక్కవతారమిట్టిదై

పాటిలఁబోలు ; దీని ప్రతిభానమెఱింగిన నేటివారలే
మేటులు శేషకాల జన మిందఱికంటెను సాయిసద్గురూ! 23

ఉ. స్రావిని దేశకాల మత జాతి జనుః ప్రభృతిప్రభేదముల్
పావనమైన నీ కరుణ పాఱుట కడ్డమురావు మానవా
త్మావని మీఁద ; నే యభిధమై భగవంతుని నేరు సీరినన్
నీవయి వచ్చి ప్రోఁచితి వనిష్టములందున సాయిసద్గురూ! 24

చ. లవణ జలంబులందు సరళాంబువులందును బ్రాణిసంఘముల్
నివసనముండు సౌఖ్యమున ; నింకొకదాని నివాస మొక్కదా
ని విలయ ; మిట్టులుండుటకు నీదు నిదేశమె తప్ప వేఱు హే
తువు గలదే? వితర్కములు తోఁచునె యేరికి? సాయిసద్గురూ! 25

ఉ. ఒక్క రుజావిశేషమున నొక్కఁడు సేఱు యమోపకంఠమున్
గ్రక్కున ; నింకొకండు చిరకాలమదే రుజ స్రుక్కి చచ్చు ; వే
ఱొక్కఁడు దానినే గెలిచి యుండును బూర్ణశతాయుషాన ; నీ
నిక్కపు టిచ్ఛ గాకిచట నేది వితర్కము? సాయిసద్గురూ! 26

ఉ. వక్కణలీయ మీకు ననవశ్యము జాబులు దూరవాణియున్ ;
జక్కికిఁ జేఱ రాఁ దమ కసాధనముల్ పొగబండ్లుఁ బుష్పకాల్ ;
లెక్కకు మిక్కుటంబయిన ఱెక్కలుఁ గండ్లును గాలుసేతు లీ
రెక్కడ నైన మొల్చు విరలేశ్వరు లెన్నఁగ సాయిసద్గురూ! 27

ఉ. వేయిశరత్తులొక్క గుహ వెక్కసమౌ తమమందు మ్రగ్గినన్
వేయివెలుంగుఱేఁడు కనువేసిన తత్ క్షణ మెల్లచీఁకటుల్
మాయము గావె? యక్కరణి మా దురితంబు లవిద్యయున్ జిర



స్థాయులె కాని మీ కరుణ క్షాళనమౌఁ గద సాయిసద్గురూ! 28

ఉ. అన్నిట నున్నదీరె, మఱి యందఱిలోపల నున్నదీరె ; యి
ట్లున్నను శేషితుల్ బహుగతోద్భవకర్మములన్ భుజించు నా
డన్నరు బాసటయ్యెదరు ; తామొ? మొదల్ గతకర్మరాశినే
మన్నుగఁ జేసి యిచ్చెదరు మన్గడ క్రొత్తది సాయిసద్గురూ! 29

ఉ. ఎవ్వఱు శాపమిచ్చినను హేళన సేసిన వాదు వైచినన్
నెవ్వగఁ జెంది కుందుట యనిష్యము దేశిక! నీవొకండె చి
ర్నవ్వులతోఁడ దీవనలు నమ్మెడివారల కిచ్చితేని వే
దవ్వయి మాఁటుమణ్గును వ్యథావళి సొంతము సాయిసద్గురూ! 30

ఉ. వంచనమూలకంబులును, వాగ్గత పాప సమాశ్రయంబులున్,
మంచితనాలకున్ బనికిమాలిన చోటులుఁ , బ్రశ్రితత్వమున్
ద్రుంచెడు కర్మ, లీశగురుదూరకరంబులు, నన్యజీవిహిం
సాంచితమైన వృత్తుల నొసంగకు నాకిల సాయిసద్గురూ! 31

ఉ. మారిన ప్రత్న తస్కరులమైనను మారని రక్షివర్గపుం
దీరుగఁ బ్రాక్ కృతాఘ సమితిప్పటికిన్ మముఁ దర్మచున్న, దా
ధారము నీవె యీ చెడు గతంబున నుండి బహిర్గమింప మా,
కారసి జాలితోడ సహకారమొసంగుము సాయిసద్గురూ! 32

ఉ. తీయని పేర్లు వేయెనిమిదింటిఁ బఠింపఁగలేను నిత్యమున్,
చేయఁగలేను నైష్ఠికతచే నుపవాసము లొక్క ప్రొద్దులున్,
వేయఁగలేను గోర్కె నెఱవేఱినచోఁ బలు పొర్లుదండముల్,
కాయము దుర్బలంబు, మది గందరగోళము సాయిసద్గురూ! 33

ఉ. చూచినదెల్లఁ గోర్కెయగుఁ , జొచ్చినదెల్లఁ బటిష్ఠబంధమౌ,
దాఁచినదెల్ల స్వంతమగుఁ , దాఁ గడియించినదెల్ల గర్వమౌఁ
గూచితనంపుఁ జేష్టలిటు కొన్ని దశాబ్దుల జీవితంబునం
దాచరియించువాని కెటులౌను వివేకము? సాయిసద్గురూ! 34

ఉ. వాలి మనుష్యముఖ్యులను వాంఛితపూర్తికి వేఁడువారు దే
వాలయ బాహిరాంగణము వద్దనె నిల్తురు ; మిమ్ము వేఁడువా
రాలయమందుఁ జొక్కెదరు ; స్వాత్మను దేనిని గోరకున్న మీ
లో లయమై భజింతురతిలోక విముక్తిని సాయిసద్గురూ! 35

ఉ. చేసిన స్నానముల్ పసిఁడిచేలములున్ విపులాలికంబునన్
వ్రాసిన వింతనామములు రమ్య పదార్థవిశేష మిశ్రితా
న్నాసవముల్ వృథల్, నిను మనంబునఁ గొల్చి నివేదనంబు లీ
ధ్యాసయె లేనినా డుభయ దాయక! నాయక! సాయిసద్గురూ! 36

ఉ. విష్ణుసహస్రనామములె వీడక వార్చు త్రికాలసంధ్య ; శ్రీ
కృష్ణుని గీతయే నిరత ఋగ్యజురాదిక పాఠమౌను ; మీ
జిష్ణు చరిత్రమే పలు ప్రసిద్ధ పురాణసమంబు ; మీదు భ్రా
జిష్ణు శుభాహ్వయంబె తులసీప్రణవంబులు సాయిసద్గురూ! 37

చ. అహరహ మొక్కసారి మిము నాత్మఁ దలంపని మొల్ల మే
ల? హరిహర ప్రజాపతి విలాసులరౌ మిము మాఁటుపుచ్చి లో
నహమును బెంపుసేయు యశమయ్యది యేల? స్వవంశ జా
త హతకులేల? మీకు నిరతార్చన సేయక సాయిసద్గురూ! 38

ఉ. స్వచ్ఛమనంబునన్ దెలియ సర్వజగత్తున నెక్కడైన యా



దృచ్ఛికమే హుళక్కి ; భవదిష్టము లేక ఘటిల్లదేదియున్ ;
ద్వచ్ఛుభ శేముషిన్ మొఱఁగి తానొక జీవియు డాఁగనేర్చునే?
యచ్ఛ మదృష్టమీరిడక యందదు తానుగ సాయిసద్గురూ! 39

ఉ. "మాయ యవిద్య బ్రహ్మ"మని మానవుఁడెన్ని కబుర్లు సెప్పినన్
రేయి పరుండి ప్రొద్దటికి లేచుటయున్ దన చేతిలోన లే
దే! యసమానమైన భవదీయ కృపానుమతి ప్రకారమే
సూ! యఖిలంబుఁ దా నడచుచుండును దప్పదు సాయిసద్గురూ! 40

చ. పొడమిన దేశకాలములు పుణ్యయుతంబులు గావు, ప్రజ్ఞలున్
బొడవులు గావు, సంగములు పూతము గావు, పురాకృతాఘముల్
జడములు గావు, తత్త్వములు సత్పథగాములు గావు, మాకు మీ
యెడ మతి గల్గుటల్ దమ మహీయ ఉదారత సాయిసద్గురూ! 41

చ. నికరమునుండి యోసరిలి నిర్జన గర్జన తర్జనాటవిన్
వికల మనీషఁ గ్రుమ్మటెడు విహ్వల వత్సములంటివార మే;
మిఁక నయినన్ ద్వదీయ శమమేదుర సాత్వత గోష్ఠగోష్ఠిలో
సకలము విస్మరించి యుపశాంతిఁ దరింతుము సాయిసద్గురూ! 42

ఉ. మంచి పనుల్ పొనర్ప ధనమన్నది లేదు, మిమున్ గుఱించి యో
చించుదమన్న నంతటి విశేష మనీషయు లేదు, లేదు ప్రా
క్సంచిత భోగవాంఛ కుపశాంతి, సదేహ గురుండు లేఁడు. లే
దంచితమైన యోగ్యత; యుదారతఁ జూడుఁడు సాయిసద్గురూ! 43

చ. అగణిత కర్మపాశమున కైహికపున్ గడఁ గట్టి యున్న ధే
నుగణము మేము, మెడ నుంచిన త్రాడిది సాఁగు దన్కఁ బో

వఁ గల, మటయ్యుఁ బాపముల వాములు ప్రోఁగగుచుండె, నింక మా
తెగువకుఁ బగ్గముండఁగలదే యిది విప్పిన? సాయిసద్గురూ! 44

ఉ. పాపిని నేను, నీచపశువన్, దనుమాత్రక చేతనుండ, స
ల్లాప విదూరుఁడన్, ద్రవిణలాభ గతాత్ముఁడ, స్వార్థబుద్ధి, ధ
ర్మాపర రావణుండ ; నను మన్నన సేసి తరింపఁజేయుటె
ట్లో పరమానుకంపఁ గనుటొప్పును మీ రిఁక సాయిసద్గురూ! 45

ఉ. కాలిన కొంప సొచ్చి తమ కాయములం దిసుమంత బూదియున్
రాలక వచ్చువారు గలరా? పలుతిప్పల గార్హపత్యమున్
బాలన సేయ నాఱు పరిపంథులు మానవు పుణ్యకోశమున్
లీల నొకింతయైనఁ గదిలింపవె? కావుము సాయిసద్గురూ! 46

ఉ. ధర్మ మధర్మమున్ దెలియఁ , దాపసనిష్ఠలు నేర్వనైతి, స
త్కర్మము దుష్టకర్మముఁ దదంతిమ రూపమెఱుంగఁ , బ్రాజ్ఞనుర్
మర్మమెఱుంగ ; మద్విదితమైన విపత్తరణాయనంబు మీ
శర్మచయావహాంఘ్రియుగ సంగ్రహణం బిఁక సాయిసద్గురూ! 47

చ. నరునకు శ్రేయమున్ నరుఁడు నవ్వులకైనను గూర్పనేర్చునే?
పరులకుఁ గల్గు కష్టము నెపంబున బాసట పేరిటన్ ధనా
హరణమె లోకతత్త్వ ; మిల నందఱకున్ నిజమైన శ్రేయ మా
దరమునఁ గూర్పఁజాలు పరదైవమె మీరయ సాయిసద్గురూ! 48

ఉ. లోపలి పాపపూరుషుఁడు లోక విగర్హిత పాప మాత్మకున్
జేపడఁ బ్రోత్సహించు, మఱి చేసినదాని ఫలంబు పైఁబడన్
దాఁపున లేక మాయమగుఁ ; దత్సముఖంబునఁ బుణ్యపూరుషుం



డేపఱి చిక్కె ; వీని బలదీపితుఁ జేయుఁడు సాయిసద్గురూ! 49

ఉ. ఎల్లఱియందు మీరె కల, రవ్వఱి నిద్దర బాధపెట్టినన్
జెల్లును మిమ్మె యేఁచినటు ; చేతన మాలి గతోద్భవంబులన్
బెల్లుగ లాఁతుల న్నెఱియఁబెట్టినచో క్షమ వేఁడెదన్ మిము,
న్నుల్లమునందుఁ గైకొని ననున్ శుచిఁ జేయుఁడు సాయిసద్గురూ! 50

ఉ. అర్హత లెక్కఁగట్టి నను నల్లన దూరము పెట్టఁబోకు, నే
గర్హిత దుష్టచేష్టుఁడనె, కాదనలే, దొకసారికే పురిన్
బర్హి విదల్చి యాడ మును పబ్బిన కాటకమెల్లఁ బోవదే?
స్వర్హిత! యట్లె నీ కరుణ సాధువనయ్యెద సాయిసద్గురూ! 51

చ. పగతుర మేమె మాకుఁ , బ్రతిపక్షులు గారు పిశాచరాక్షసుల్
ఖగములు ; క్రూరతన్ జలుపఁగా సరిపోలరు వారు మాకు మే
మొగి నొనరించు కీడుల ; మముం గని మేమె సదా భయంపడన్
దగు ; సదసద్వివేకమిడి ధన్యులఁ జేయుఁడు సాయిసద్గురూ! 52

చ. స్థలమహిమల్ సమాధులును శైలములున్ బలు గంగియేఱులున్
వెలసిన క్షేత్రముల్ మొదలు వెక్కులు గాంచితిఁ ; బూర్వవాసనల్
దొలఁగవు వజ్రలేపముల ధోరణి ; నింకఁ గుటీచకుండనై
విలువగు మీ పదద్వయము వీడక కొల్చెద సాయిసద్గురూ! 53

ఉ. పుణ్యసమాహ్వయంబయిన పుత్తడిపంజరమందు నన్ను లా
వణ్యవరేణ్యమౌ చిలుకవైనమున న్నిడఁబోకు బందిగాఁ ;
బుణ్యమొ, పాపమో, పనుల పూర్ణఫలంబును నీవె కొమ్ము ; బ్ర
హ్మణ్య పదంబొసంగి నను మన్నన సేయుము సాయిసద్గురూ! 54

ఉ. పెన్జైఱసాల లోక, మతిపేశల వర్తనఁ గొందఱిచ్చటన్
మంజుతరాధికారులయి మాన్యత నొందిరి బందికోటిపై ;
రంజిలనేల దానికిఁ ? జెఱ న్నధికారము సేయుకంటెఁ దా
రంజుగ బైలువారుటె వరంబు నరాత్మకు సాయిసద్గురూ! 55

చ. కదిలెదమన్ మనోభ్రమను గల్గి చరించును బండిచక్రముల్;
కదిలెదనంచు బండియు సగర్వముగాఁ గదులున్ ; దురంగముల్
కదిలెదమంచు నెంచు నిజకర్తను విస్మరియించి ; మేము నీ
ముదల ప్రకారమాడుచు విముక్తులమందుము సాయిసద్గురూ! 56

చ. వలవదు నైక రై కనక వాహన వస్తు ఘనప్రశస్తియున్ ;
వలదు చతుస్సముద్ర పరివారిత విస్తర రాజ్యసత్తయున్ ;
వలవవు నాకలోక సుఖవాసనలున్ భృశ కీర్తిచంద్రికల్ ;
వెలయఁగనిమ్ము నిశ్చల వివేక విరక్తుల సాయిసద్గురూ! 57

చ. ప్రతిఫల భోగకాంక్షలకుఁ బాల్పడి కోల్పడు పారమార్థికో
న్నతి వల; దెల్ల వేళల ననశ్వరమై పరమేష్ఠికోటి జీ
విత సమయాధిగామి యయి విచ్చు వినిర్మల భక్తిభావమున్
వితరణ జేయు మక్కటిక వీడక నా పయి సాయిసద్గురూ! 58

ఉ. హీనపు లోనిహింస వెలిహింసయు మాని మనంబు హంసపై
నాను  విధాన నారయుము నన్ ; మనసా వచసా స్వకర్మణా
నే నభిలాష సేసిన జనేశ్వరతల్ ప్రసభంబుగా మనః
స్థానమునుండి యోసరిల సాయము జేయుము సాయిసద్గురూ! 59

ఉ. భోగము గాదు, కర్మఫల భోగ నిమిత్తమె పుట్టుకంచు మా



కే గతిఁ దేఁటతెల్లమగు? నింతకు ము న్నెద లేని వాసనల్
ప్రోఁగగుచుండె ముంతపొగ పోలిక, నుక్కిరిబిక్కిరై చనెన్
వేగ మదాత్మ; యక్కటిక వీవెన వీవుము సాయిసద్గురూ! 60

చ. కలల తెఱంగులై కడచి కచ్చికలైనవి పూర్వజన్మముల్ ;
తలఁచిన లాఁతివారలకుఁ దాను వచించిన భ్రాంతులే యగున్ ;
గలిగిన దేష్యమందుఁ గలగా మిగులున్; న్నిక నేది సత్యమో
పలుకు మసత్య మేదియొ శుభ స్ఫుటవాక్కుల సాయిసద్గురూ! 61

ఉ. క్రమ్మఱ మానవుండనయి కల్గెదనన్న నిబద్ధి లేదు ; వ
న్యమ్మయి కాననంబుననొ, యాదమనై జలరాశియందొ, కీ
టమ్మయి భూబిలంబులనొ తప్పని కర్మవశాన నిట్లు నే
నెమ్మెయిఁ బుట్టినన్ విడువకేలుము కేల్ గొని సాయిసద్గురూ! 62

ఉ. అంగము మారిపోయిన యనంతర మెక్కడఁ గ్రమ్మఱన్ జనిం
పం గలవాఁడనో? యిపు డుపాసన జేసినదప్డు సాఁగునో?
భంగము జెందునో? సుమతి పాటిలునో? చెడిపోవునో యస
త్సంగ బలంబున ? న్నపుడు సైతము తోడగు సాయిసద్గురూ! 63

ఉ. చేసిన పాపముల్ తొలఁగఁజేయుటకే సరిపోదు ప్రస్తుతో
పాసన ; మింక రాఁగల యపాయములన్ దొలఁగించుటల్, మది
న్వాసలు దీర్చు టేష్యల ననామయతన్ బ్రదికించుటల్, పయిన్
మీసరమైన జన్మ, భవమీఁతయు నెక్కడ? సాయిసద్గురూ! 64

ఉ. కావున నీ యనుగ్రహము గాక భవాంబునిధిన్ దరింప మా
కే వెరవున్ స్ఫురింపదు ; సుఖేచ్ఛ మెయిన్ బహుపాశ జాలమున్

దీవలటంచుఁ జుట్టుకొనుటే మినహా బహిరాగమించు వి
ద్యా వివరం బెఱుంగము ; దయన్ వెలిలాఁగుము సాయిసద్గురూ! 65

ఉ. మత్తకరీంద్ర మజ్జనము మా త్వదుపాసన, నీదు సన్నిధిన్
జిత్తము మాలిమైన నిజజీవము పోలిక మిన్నకుండు ; నా
యుత్తర కాలమం దది బహూగ్ర విచింతన సేన కగ్గమై
చిత్తుగ నోడిపోవు ; స్థిరచేతన మాకిడు సాయిసద్గురూ! 66

ఉ. ఏది గడించినన్ శుభమొ యించు కెఱుంగము మేము ; కాన ని
న్నేది వరంబుగా నడుగుటింపా యెఱుంగము ; నీవె మాకు నా
యా దశలం దవశ్యమగు నక్కఱలన్ గుఱుతించి యిమ్ము ; మా
లోఁ దివుటల్ వినా శుభలోకన లే దెడ సాయిసద్గురూ! 67

ఉ. ఆర్తశరణ్య! "నీవ" యని యైక్యము నెంచెద నెట్టి దేవతా
మూర్తి కెఱంగినప్పటికి ; "మూఢుఁడు వీఁడు గురుప్రపన్నతా
వర్తనిఁ బట్టలే" దనుచు వావిరి నన్ ద్యజియింపఁబోకు, మా
వర్తముఁ బోని సంసృతిని వాలుగఁ గూలెద సాయిసద్గురూ! 68

ఉ. యాచనలోను దైన్యమది యేలని యే నినుఁ బెక్కు కోరికల్
యోచన లేక కోరెదను యోగిజనస్తుత! యంతమాత్రనన్
నీ చరణద్వయంబు పయి నిష్ఠలు లేవని యెంచి నా కెడం
బై చనఁబోకు ; నీకు సులభంబె యవిచ్చుట సాయిసద్గురూ! 69

ఉ. మిక్కిలి ప్రేమతోఁ గొమరుమీఱ సృజించితి వీ ప్రపంచమున్,
దక్కిన జీవజాలము, నుదగ్ర మనుష్య శరీరయంత్రమున్,
జిక్కటి జ్ఞాన-ధీ-నిపుణశీలముల ; న్నటుగాన నట్టి పెన్



మక్కువ తోడనే యెపుడు మమ్ములఁ గావుము సాయిసద్గురూ! 70

ఉ. ఇంచుక మాదు ప్రేమగుణ మెల్లెడ దుర్వినియోజితంబు, ష
ట్ప్రంచ విభక్త మల్ప బహు భంగుర వస్తువులందు ; నిట్లు మా
మంచితనంబులున్ సహిత మాఖరికిన్ జెడులై యఘక్రియా
సంచితికే సహాయమగు ; సన్మతిఁ గూర్పుము సాయిసద్గురూ! 71

ఉ. స్వాదు పదార్థ పంక్తి పయి వాలిన యీఁగ యొకింతలోనె స
మ్మోదము తోడుత న్నడుగుమోఁపుఁ గదా మలమందు! చంచలో
న్మాది మనుష్యమానసము నట్టిదె ; దీనను బుణ్యహాని మా;
కాదరమూని మానుపు చలాత్మక తత్త్వము సాయిసద్గురూ! 72

చ. ప్రతిదినమాచరించు ముఖర స్తుతిపూజనమాది మాది నీ
శ్రుతిపుటయుగ్మమున్ దఱియుచుండునొ లేదొ యెఱుంగరాదు ; దు
ర్మతిని సకృత్తుగా నధరమాడిన నిష్ఠురభాష మట్టుకున్
శతగుణమై వినంబడును, శాపముఁ బెట్టకు సాయిసద్గురూ! 73

చ. ఇదివఱ కెన్నిసారు లిటు లీశ్వరమార్గముఁ బట్టి పోతినో?
వదులుమనస్సుతో భువనవాసనకున్ బడి లొంగి యెన్ని మా
ర్లెదగ కధోగతిన్ బొరలి లేచితినో? యిఁకముందు క్రమ్మఱ
న్నదియె ఘటిల్లకుండునటు లాశిషలీయవె? సాయిసద్గురూ! 74

ఉ. నశ్వరమైన స్వార్జిత ధనాలయ దేహములంతరించుటన్
విశ్వసనంబు మాని, తన వెన్కటి పుణ్యఫలంబు సత్త్వము
న్నీశ్వరమైత్రి దూరమగు నీచదశాగతి నాకు నెన్నడున్
విశ్వగురో! యిడన్ వలదు, విన్నపమియ్యదె సాయిసద్గురూ! 75

ఉ. ఆమయ నిర్జితంబయిన నంగ విరూపితమైన నుర్వి నే
వామయుఁ గోరకుండునటు వార్ధక జర్జరితంబు నైనఁ దా
క్షేమముగా నిలంబడు నిసీ! నరజాతికి లోఁ గళేబర
ప్రేమము ; పోవఁగొట్టి తెఱిపింపుము కన్నులు సాయిసద్గురూ! 76

ఉ. జ్ఞానము నిష్ప్రయోజనము, నైపుణి వ్యర్థము, నైకరీతి స
ద్మానసికాశయంబులు వృథల్ త్వదనుగ్రహమొండు లేనిచో ;
దానను సంక్రమించు మహదాయు రనామయతా విభూతులే
మానుగ మాననీయములు ; మాకిడుమా యివి ! సాయిసద్గురూ! 77

ఉ. తొండనికొక్క రూపమునఁ దోడయి కాఁతువనంగ వింటి ; దే
వుండవు నీకు భాగవతులుందురు లక్షలుఁ గోటులాది భూ
మండలమందు ; నిందఱికి మధ్యన నా మనవాలకించి నన్
మెండుగ గుర్తువెట్టుకొని మేలొనరింపవె సాయిసద్గురూ! 78

ఉ. పెద్దలు పెద్దలందు ; రిలఁ బెద్దలెవర్ నరమాత్రులందు ? గోర్
ముద్దల యొద్ద మైమఱచు మూఢపు నిద్దుర యొద్దఁ దా
మొద్దిక ముద్దరాండ్ర జత యొద్దను, జబ్బుల యొద్ద నందఱున్
ముద్దుల కూనలే తమఱి మ్రోలను దప్పుదు సాయిసద్గురూ! 79

ఉ. నమ్మిక లేనిచో నరుఁడు నాశనమై చను సర్వరీతులన్ ;
నమ్మకమెక్కువైనను వినాశముఁ దెచ్చుఁ బులస్త్యపౌత్రు చం
దమ్మున స్వీయదుర్మతికి దైవసమర్థనమున్నదంచుఁ దా
నిమ్ముగ రేఁగు మానవుఁడు నిర్మమతామిష సాయిసద్గురూ! 80

ఉ. దీర్ఘశతాయుషం బదియుఁ దేలికయే ఘనకాలవాహినిన్ ;
దుర్ఘటమొక్కఁడే బహుళ దూరశతాబ్దుల జ్ఞానరాశులన్
నిర్ఘృణ జీవిత ప్రహరణీయుఁడు గాక గడింపఁ ; బావనా
నర్ఘ గురూత్తమున్ బనుపు మన్నిఁటికిన్ గృప సాయిసద్గురూ! 81



ఉ. చీమ చిటుక్కుతో సమము సింధు దిగంత పరీతకీర్తియున్ ;
తాము సజీవులైన తఱి దన్కనె మాన్యతలున్ ఘనత్వముల్ ;
నామముఁ దల్వఁబోరు తమ నాలవ వంశతరంబువారె ; యా
కామన నాకు లే, దభవ గమ్యమె చాలును సాయిసద్గురూ! 82

ఉ. చన్న విశేషముల్ మదికి జ్ఞాపకమైనను నవ్వు వచ్చుఁ ; దా
వెన్న వలెన్ హిమంబు వలె వేఁడిఁ గఱంగిన స్వప్నకల్పమై ;
తిన్నదె తిన్చు, నారసినదే తిలకించుచు, నన్చు నన్నదే
మన్నదె మన్చు వేసఁటలు మాకనిపింపవు సాయిసద్గురూ! 83

ఉ. క్రీడనకా లమూల్యము లకృత్రిమ పోతున, కక్కుమారుఁడే
కోఁడె వయస్కుఁ డైనపుడు కొమ్మల యర్మిలి ప్రాణధారకం,
బీడు గతింప సంపదలుఁ , బిమ్మటఁ దా జనతాధికారమున్
వేఁడు ; నిఁ కెప్పు డేమెదుగు వేళ? జనాశ్రిత! సాయిసద్గురూ! 84

ఉ. ఏల యనస్తితా భ్రమ మనేకులకున్? దమ దోఁడివారిలో
నీ లవలేశమున్ గనఁగ నేఱని దుస్సహ నిస్సహాయతల్?
మేలును గోరు నేస్తములు, మెత్తని సోదరు, లమ్మనాయనల్
శ్యాలకు, లాలుబిడ్డలును నయాచిత దీవన సాయిసద్గురూ! 85

ఉ. కోరినదివ్వలేదనుచుఁ గొందఱు, రాఁగల ముప్పుఁ గూర్చి యిం
పారఁగ ముందె చెప్పి చెడుఁ బాఁపితి కావని కొంద, ఱాప్తు లె

వ్వారొ యకాలమృత్యువున వాడిరటంచు నినున్ భజింపరే!
నేఱమె నీది నీవు గొన? నేర్వరు మూర్ఖులు సాయిసద్గురూ! 86

ఉ. బానిసలైనవారు తమ బానిస దుఃస్థితి కుబ్బినట్టులే
శ్వానము స్వీయకంఠమున సంకెలఁ జూచి మదించినట్టులే
మానవు లాత్మఖేదముల మాఁటున డాఁగిన హేతులేవొ య
వ్వాని గడించి పొంగెదరు వర్యుల మేమని సాయిసద్గురూ! 87

ఉ. ఱేని కుమారుఁడై పొడమి, ఱేని నిదేశము చొప్పునన్ నియో
గానుగుణంబుగా విధులఁ గానొనరించుచు, మెల్ల దానిలో
లీన మనస్కుఁడై, భృతక రిక్థమె జీవితమంచు వారసుం
డేనని విస్మరించు నరు నీడులు జీవులు సాయిసద్గురూ! 88

ఉ. తీఱని కోర్కెలన్ బహువిధీకృత రాగములన్ మనో జగద్
వీరములన్ భ్రమంబుల భవిష్య జనుఃకథ జాతివ్రాతలై
పేఱఁగ వ్రాసికొందు మతిపేలవ మానసికాక్షరావళిన్ ;
దూఱెద మస్మదాత్మపథ దూరత కీశ్వరు సాయిసద్గురూ! 89

ఉ. ఈ యిలఁ గూర్చి మంచి వచియించుట కేమియు లేదు ; స్వీయమౌ
సోయగ మాసఁ జూపి యసుశోభ హరించెడు కామినీ పిశా
చాయిత ; మిట్టిదాని వెసఁ జక్కన సేయఁ గడంగుచో నఘం
బే యొడఁగూడు దోషములఁ బేర్కొను ప్రక్రియ సాయిసద్గురూ! 90

ఉ. ఉండక తప్పవేమొ తనువూపిరిఁ దీసెడునంతకాలమున్
దండ కమండలు ప్రభృతిధారులకున్ గతిచిన్మనోరథా !
లొండు మనోరథం బయిన నుండనిచో నిహలోకయాత్రకున్



గండి వడున్ గదా? దయను గాంచుము మమ్ముల సాయిసద్గురూ! 91

ఉ. ఎంత వయోజనుండయిన నేఁపుగఁ బెర్గిననైన మానవుం
డాంతరమందు నొక్క శిశువై ప్రతిదానిని నాఁటబొమ్మగా
స్వంతము సేసికోఁదలఁచి శత్రుల మిత్రుల దుష్కృతంబులన్
వింతగఁ బ్రోఁగుసేయును ; వివేక మొసంగుము సాయిసద్గురూ! 92

చ. తెలియు కొలంది బాధపడుటే మినహా యుపశాంతి యేది చం
చల నరమానసంబునకు? సర్వము జ్ఞాన మజాగళ స్తనం
బులకు సమాన, మందులకుఁ బూరకమై బహుధా బలోత్కరం
బలవడకున్నఁ ; గాన నవి యందఁగఁ జేయుము సాయిసద్గురూ! 93

ఉ. మూరెడు మాత్రమై పొలఁచు ముద్దుల బిడ్డ శిరంబు మీఁద నే
తోరపుఁ బూర్వకర్మ గలదో, సకలంబుఁ దృజించిపోయిన
ట్లారయవచ్చు ప్రేతుని రయంబున గుంజుకపోవు కర్మ దు
ర్భార మదెట్టిదో భవదుపజ్ఞకె తెల్లము సాయిసద్గురూ! 94

ఉ. కాలును జేయియున్ దమకుఁ గట్టడలోఁ గలయంతకాలమున్
నేలయు నింగిఁ గాన రవనీజను లామున గ్రుడ్డికంటులై ;
కాల లులాయ కంఠగత ఘంటిక లామయ లక్షణాకృతిన్
గోలగ మ్రోయ సత్యములు గుర్తుకు వచ్చును సాయిసద్గురూ! 95

చ. పఠనలలోనె తప్ప క్షమ పాటిలు నెక్కడ? నీ సమస్తమున్
గఠిన కఠోర కర్కశ వికార విచారమయ ప్రపంచమే ;
హఠములె గాని యేరికి దయార్ద్రత యెవ్వటి మీఁద ? దేవ! మా
శఠతల నోర్వఁజాలు నొక స్వామివి నీవిల సాయిసద్గురూ! 96

ఉ. గాసిలువారి నింకఁ గడు గాసిలఁజేయుటె లోకతత్త్వమౌ ;
వాసిగ లోకఖేదములు వాప నొనర్చిన యేరుపాటులున్
గాసిలఁజేయుఁ దద్దయు ; నకారణ దాతవు నీవె ; మానవుం
డాసర యివ్వఁజాలునె తదన్యుల కించుక? సాయిసద్గురూ! 97

ఉ. చేయుటకైన నీవొకటి చేయకపోవుటకైన నున్నవే
వేయి పథాలు నీకు ; నిను వేఁడుట గా కిఁక వేఱుదారి లే
దాయెను మాకు ; నిట్టి యసహాయుల విహ్వలమానవాత్మలన్
బాయక కావు ; నీదు పదపద్మము లూఁదెద సాయిసద్గురూ! 98

ఉ. లౌకిక మాత్మికం బుభయ లక్ష్యముల న్నెఱవేర్పఁజాలు నీ
యేక మనుష్యదేహ ; మిది యెక్కడఁ గొంచెము మూలఁబడ్డ నీ
లోకము లేదు, లేదు పరలోకము గాన భవద్దయామృతా
లోకనఁ గూర్పు మాయువు నరోగతయున్ ఘన సాయిసద్గురూ! 99

చ. కనిన స్వయంకృతాత్మకము కానివి క్లేశము లుర్వి లేవులే!
మనుజకృతైక కష్టముల మాన్పుట మా పని గాదనన్ జగ
త్తునను సహాయశబ్దమె యదృశ్యమగు ; న్నటుగాన మమ్ము మా
వనటల నుండి తేల్పు మనవద్య కృపానిధి ! సాయిసద్గురూ! 100

చ. ధనికుఁడు నవ్వు మొత్తములు దక్కెడు దారి యెఱుంగకే కదా
ధనరహితుల్ స్వఘాతకును దారొడిగట్టుట! మా విపత్తు నీ
కు నొక విపత్తె కా, దయిన క్షుద్రనరాత్మకు గొప్ప ప్రాణయా
తన యది ; శక్తి లేని మముఁ దప్పక ప్రోవుము సాయిసద్గురూ! 101

ఉ. దాహముఁ దీర్ప నీర మనఁదైన నిఁకేమిటి తీర్పఁజాలుఁ ? బ్ర



త్యాహిక వేదనావ్యథల నాదర శేముషి నాలకించి ధా
రాహితమాచరించు గురురాజవు నీవె తిరస్కరించుచో
నే హరిదంతరంబు నిఁక నేర్పడదాత్మకు సాయిసద్గురూ! 102

ఉ. నీవెవటో యెఱుంగని మనీషులుఁ , బుట్టిననాటఁ గోలె నీ
భావన మొక్క మారయినఁ బాటిలి చేయనివారు గూడ శీ
ఘ్రావితులైరి కారె త్వదగాధ కృపామహిమన్? సదా భవ
త్సేవకులైన మమ్మును నశింపక కావుము సాయిసద్గురూ! 103

చ. వెఱ నిను నాశ్రయించుటకు వెన్కను మేము నశించుచో యశ
స్కరమది కాదు నీకు ; ఘనసద్గురువీవు, స్వయాన దేవుఁడౌ ;
పరపరమాల్పభూతులము, పాపుల మే, మటుగాన మా కెవర్
శరణము నీవు దక్క? కృప సంధిలఁ జూడుము సాయిసద్గురూ! 104

ఉ. ఆశలు దీర్పు, మాశయము నందుకొనన్ సహకారమిమ్ము, సం
దేశములిచ్చి మా హృదయదీనతలన్ బెడఁబాపివేయు, మా
కాశముఁ బోని నిర్మల వికాసపథానఁ బ్రవేశపెట్టు, మ
మ్మీశుని కోటిలోఁ గలుపు, మియ్యదె ప్రార్థన సాయిసద్గురూ! 105

చ. ఎదవెతలొక్కచోఁ గొలుపులింకొకచో - నిటు "దేని దారి దా
నిదె" యనినట్టులున్నయెడ నిఁకఁ బ్రయోజనమేమి స్వామి? నీ
పదయుగమాశ్రయించు చిరభక్తులకున్ బెఱవారి కెచ్చుగా
బ్రదుకునఁ దేడ లేనియెడ బన్నము నీకది సాయిసద్గురూ! 106

చ. అధికతఁ గోరలే దెపుడు నన్యుల మీఁద , నశేషలోక స
ద్విధమగు ధారణంబె మది వేఁడితి ; దానికిఁ గూడ నాదు పు

ణ్యధనము సాలకున్నఁ బ్రతియర్చనకున్ బదిరెట్ల పుణ్యమున్
మధురముగా నొసంగి వెస మన్గడ మార్చుము సాయిసద్గురూ! 107

చ. మనమునఁ జిన్నతప్పులని మాకనిపించెడువాని కుగ్ర దం
డనలు విధించి, "కర్మమది తప్ప" దనన్ దగునే? యశక్తులౌ
మనుజులమేము ; మా స్థితిని మర్వకొసంగుము ; సర్వశక్తిమం
తుని కరుణాప్రకోపములు దుర్విషహంబులు సాయిసద్గురూ! 108

చ. అహమును వీడఁ గర్మఫల మంటదనంగను వింటి ; దేహిగా
నహరహముండ నెట్టులది యౌనని యెవ్వఱుఁ జెప్పరైరి ; మా
కిహమున లంకె లేని పితృకృత్యఫలంబులె సోఁక నేము స
స్పృహముగఁ జేయు కర్మములు సెందకపోవునె ? సాయిసద్గురూ! 109

ఉ. ఏమి ఘటించినన్ దొలఁగు, నెంత ఘటించినచోఁ దొలంగుఁ బూ
ర్వామిత కర్మరాశి యిది? ప్రాజ్ఞిగమోక్తములైన నిష్కృతుల్
మేమొనరింపఁజాలమయ! మిక్కిలి దుర్బలమీ యుగాంగముల్ ;
నీ మహితాఖ్యఁ బాడెదము, నీవె శరణ్యము సాయిసద్గురూ! 110

ఉ. బేలలమేము, గేస్తుల, మపేత సుసత్త్వుల, ముల్లమందునన్
వేల కొలంది భీతులును వేఁదుఱులున్ గలవార, మజ్ఞతా
హేలుల, మార్షశాస్త్ర విహితేశ్వర మార్గపు టున్నత ప్రమా
ణాలకుఁ దూఁగలేము ; మము నక్కటికన్ గను సాయిసద్గురూ! 111

ఉ. ఇంచుక శీతలం బధికమేనియు, నించుక కాఁక యెక్కినన్
గొంచెము గాలి రేఁగినను, గొద్దిగ వానలు కుండవోసినన్
బంచతకున్ సమీపమగు పాడుశరీరము మాది ; మమ్ముఁ బు



ట్టించిన నీవె ప్రోవఁదగుఁ దిప్పలనుండియు సాయిసద్గురూ! 112

ఉ. భాష సృజించు భ్రాంతులను బారఁగఁద్రోలుము, నిత్యసత్య మ
న్వేషణమాడ సత్త్వముల నిమ్ము, మనంబున నుండి మోహమున్
బ్రేషణ సేయుమెప్పటికిఁ బ్రేమ-వివేక-విరాగరాశి ని
శ్శేషముగాఁ బ్రపూరితము సేయుము నా మది సాయిసద్గురూ! 113

చ. గురువుల గూర్చి, పెద్దలను గూర్చి, జనించిన జాతి-వంశ-భూ
పురముల గూర్చి, సాహ్యకర పోషకవర్గము గూర్చి దేవతా
వరులను గూర్చి, యార్షకృతివర్గము గూర్చియుఁ బూర్ణసత్యముల్
దెలుచుట యన్ గుణంబు వలదెప్పుడు నాకిల సాయిసద్గురూ! 114

ఉ. ఆపదలందు రోగములయం దవమానములందు, భార్గవీ
లోపములందుఁ బాపపుఁ బ్రలోభములందు విరోధిమండల
వ్యాపనమందు నాఖరి ప్రయాణమునందును నిన్నె నమ్మున
ట్లోపిక నిమ్ముపాసనల కోటమి లేకను సాయిసద్గురూ! 115

ఉ. నీ పదమూఁదినందులకు నీ లఘుజీవుఁడు నీదు కోవెలన్
గోపుర విగ్రహాల నొక గోపురవిగ్రహమౌనొ, నీ కడన్
దీప మయూఖదీప్తుఁడయి తీఱునొ, యెల్లఱు మట్టగించు పెన్
దాపగ నిల్చిపోవునొ త్వదాజ్ఞ యదెల్లను సాయిసద్గురూ! 116

ఉ. సత్యపు లోకమందలి విషాదములే సరిపోనియట్లు సా
హిత్యము పేరు బెట్టి మఱియున్ని విషాదములన్ సృజించి మేల్
ముత్యములంచు నెంచి యతిమూర్ఖత వాని గుఱించి వాదముల్
నిత్యముఁ జేయువారి సరణి న్ననుఁ జేర్పకు సాయిసద్గురూ! 117

చ. కురియును వార్ధిలోన శతకోటుల పెట్టునఁ జిన్కు, లందులో
మురిపెపు ముత్యమై మెఱయు ముచ్చట కొన్నిఁటికే స్వకీయ ; మెం
దఱొ సుమనోహరార్థక పదాంచిత సత్కృతులన్ రచింత్రు ; నీ
కరుణకుఁ బాత్రమైన కృతి క్వాచితమారయ సాయిసద్గురూ! 118

**ఉ. ఆష్ఠగ రెండువేల పదు**
**నైదవ వత్సరమందు నిండ గ్రం**
**థస్థతఁ గన్న యీ సుకవి**
**తా స్తుతిమాలికఁ బాడువారికిన్**
**స్వస్థతయున్ జయంబు మఱి**
**స్వాస్థ్యములున్ యశ మాయుషం బిలన్**
**సుస్థిరమౌనటుల్ కరుణఁ**
**జూడు జగత్పతి ! సాయిసద్గురూ !**



|| ఓం శ్రీ దత్తాయ గురవే నమః ||

||ఓం శ్రీ సమర్థ సద్గురు సాయినాథాయ నమః ||

||ఓం పూజ్యశ్రీ ఆచార్య ఎక్కిరాల భరద్వాజాయ నమః ||

# అల్లాహ్ మాలిక్

*(శ్రీసాయిసద్గురు శతకము)*

## లఘుటీక

**'వాచస్పతి'**

*(ఇవి ప్రతిపదార్థములు గానీ, తాత్పర్యములు గానీ కావు. ఇచట కేవలము కఠిన శబ్దములకే అర్థములివ్వఁబడె నని గమనిక)*

**1 వ పద్యము :-** శ్రీకర = శుభమును/ శ్రేయస్సును చేకూర్చునట్టి ; సత్య-తత్త్వ = పరబ్రహ్మతత్త్వమనెడి ; సరసీ = సరస్సులో ; విహరత్ = విహరించునట్టి ; వర = శ్రేష్ఠమైన ; రాజహంస! – రాజహంసవంటివాఁడా ! ; ఆర్త = రోగులు ; ఆకుల = బాధపడుచున్నవారు ; వాంఛిత+**అర్థి** = కోరికలను కోరువారు అయిన ; జనతా = వివిధజనుల చేత ; అర్పిత = అర్పింపబడిన ; హార్దిక = హృదయపూర్వకమైన ; సుప్రశంస! = స్తోత్రములు గలవాఁడా! ; స్వీయ = నీదయిన ; అకలుష = పవిత్రమైన ; ఇతిహాస = చరిత్రమును ; పఠన+ఏక = చదువుటయే ; పరాయణ = ధ్యేయముగా గలవారికి ;

సుప్రసన్న! = బాగుగా ప్రసన్నమగువాఁడా! ; ప్రజ్ఞా-కలిత = వివేక వంతులైన ; ప్రపన్న = నీ భక్తుల యొక్క ; సుమనస్ = పవిత్ర హృదయము లకు ; సుమనస్ తరు! = దేవతావృక్షము (కల్పవృక్షము) వంటివాఁడా! ; సాయిసద్గురూ! = (సుబోధము)

**2 వ పద్యము :-** నిన్నున్ అధఃకరించు = నిన్ను మించు ; వినీత = వినయము తో కూడుకున్న ; స్వభక్తజన+అవనమందున్ = తన భక్తజనులను రక్షించు టలో ; వ్యగ్రుఁడై = గంభీరుఁడై ; ఎన్నఁగన్ = లెక్కపెట్టఁగా ; నిబద్ధిగన్ = ఖచ్చితముగా.

**3 వ పద్యము :-** వర్ణములు = రంగులు ; కవసినన్ = కలిసినచో ; సమాహ్వాయంబులు = పేర్లు ; భువన-నాటక = జగన్నాటకములోని ; భూమిక లందున్ = పాత్రలయందు/ వేషములయందు ; విజ్ఞులకైనను = జ్ఞానుల కైనను.

**4 వ పద్యము :-** కూఱిమిన్ = ప్రేమతో ; పలుకుల్ = పేర్లు/ మంత్రములు ; నిజంబు = నిజముగా ; అప+**ఉ**చ్చారణ = తప్పుడు ఉచ్చారణ అనెడి ; దోష-జుష్టమని = దోషముతో కూడుకొన్నవని ; త్వదీయ = నీ యొక్క ; గుణ భేదమె = గుణములలో ఒక రకమే.

**5 వ పద్యము :-** ఉపకృతి = ఉపకారముల ; ప్రకరంబునకే = గుంపునకే ; సవిస్మయంబులు+**అ**గున్ = ఆశ్చర్యముతో కూడుకొన్నవి అగును ; ప్రపన్న = భక్తుల యొక్క ; చిత్తములు = మనస్సులు.



**6 వ పద్యము :-** విపుల = విశాలమైన ; ఆత్మ-మానసము = స్వంత మనస్సు ; అమేయము = కొలఁత వేయరానిది ; దానన్ = దానిలో ; జీవ+**ఆ**వళి = జీవముల వరుస ; మా భావములు = మా మనస్సులు ; మహా-మహిమ-భంగులు = గొప్ప మహిమల యొక్క పోఁకడలను ; కానన్ = కనుక.

**7 వ పద్యము :-** సుభగ = చక్కనిది ; శుభ్ర = పవిత్రమైనది ; శుభ+**అం**గ = మంచి లక్షణములు గల అవయవములతో ; విస్ఫురత్ + రూపము= మెఱయునట్టి రూపము ; సర్వ సత్+భువన = ఉన్న అన్ని లోకములలోను ; రూఢము = ప్రసిద్ధమైనటువంటిది ; స్థావర = కదలనివి ; జంగమ+**ఆ**త్మకంబు = కదులునవియు గలది ; వచః + అమృతములు = మాటలనెడి అమృతధారలు ; ఆగమ = వేదములను ; సన్నిభముల్ = పోలునట్టివి ; స్వాప = స్వప్నములోని ; హిత-ప్రవాకములు = హితవాక్కులు ; భువిన్ = భూమిపై.

**8 వ పద్యము :-** పిశునులతోఁడన్ = ఇతరులను గుఱించి చెడు మాటలాడు వారితో ; ప్రౌఢవయి = నేర్పరివై ; కడున్ = చాలా ; విశద-మనీష = పరిశుద్ధ మైన మనస్సుతో ; ప్రోఁచు = అనుగ్రహించు ; కుశలత = నేర్పు ; గోప్యతమంబు = అత్యంత నిగూఢము ; ఇలన్ = ప్రపంచములో.

**9 వ పద్యము :-** వాంఛా-నివహంబున్ = కోరికల సమూహమును ; అడ్గిన యంతన్ = అడిగిన వెంటనే ; ఒసంగవు = ఇవ్వవు ; అస్మదీయ = మా యొక్క ; అనుచిత = అసమంజసమైన ; ఆత్మ-వాసనల = ఆత్మకు పట్టిన

సంస్కారముల ; ఆవరణంబునన్ = పాఱ మూలముగా.

**10 వ పద్యము :-** నీ కలరూపు = నీ యథార్థమైన స్వరూపము (పరబ్రహ్మ తత్త్వము) ; నిత్యము = శాశ్వతము ; తథ్య-శరీరివి = సత్యస్వరూపము గల వాఁడవు ; ఛాయా+**ఆ**కృతిన్ = నీడ వలె వెంటనంటి, వాస్తవముగా లేకపో యినను ఉన్నట్లు గోచరించు అయథార్థ రూపమను నేను.

**11 వ పద్యము :-** తేఁటలు = స్పష్టములు ; మాదు = మా యొక్క ; మనః+గతాలు = మనోగతాలు (మనస్సులలోని ఆలోచనలు) ; వచింపనేల = చెప్పనేల? (చెప్పుట ఎందుకు?) : నీదు = నీ యొక్క *(ఇచట – "నిన్ను గుఱించిన")* మగ్నులమై = మునిఁగినవారమై ; మనుచుంటిమి+ఏనిన్ = మేము జీవించుచున్నచో ; ఎఱుకకున్ = దృష్టికి ; దహించెదవు = కాల్చివేసె దవు.

**12 వ పద్యము :-** అనుకంప = దయ ; నిక్కముగాన్ = నిజముగా ; ఎట్టె దుటన్ = ప్రత్యక్షముగా ; ఏఁగుఁదెంచి = వచ్చి ; మదీయ = నా యొక్క ; శీర్షమునన్ = తల మీఁద ; కడ దన్కను = చివఱి వఱకును.

**13 వ పద్యము :-** కొల్లలు = అసంఖ్యాకములు ; యీ ధరణిమీఁది = ఈ గడ్డమీఁది ; డుల్లఁగన్ + **చే**యుచుండన్ = రాలిపోవునట్లు చేయుచుండఁగా ; భవత్ = తమఱ ; ఉద్భవము+**ఐ** = అవతారము వచ్చి ; పరార్థమునన్ = పారమార్థిక జీవనమందు ; ఎల్లెడన్ = అన్ని చోటులందును.



**14 వ పద్యము :-** చీరన్ = పిలువఁగా ; సమ్ముఖము = ఎదుటకు/దగ్గఱికి ; ఏఁగుఁదెంచెదవు = వచ్చెదవు ; స్వప్నమునన్ = కలలో ; కనవత్తు = కనిపిం చెదవు ; వక్కణన్ = సందేశమును ; నెమ్మిన్ = ప్రేమతో ; వచింతువు = చెప్పె దవు ; అక్కటికన్ = కరుణలో ; ఈడు = సమానము ; ఇలన్ = ప్రపం చములో.

**15 వ పద్యము :-** కేవల = వట్టి ; తత్త్వదర్శివని = వేదాంతివని/ యోగివని ; క్రేణి యొనర్చుట = నిర్లక్ష్యము చేయుట ; స్వయం = స్వయముగా ; దేవుఁ డు గాక = దేవుఁడవే కానిచో ; ఇజ్జగతీ జన-జాతి = ఈ+జగతీ జనజాతి ; వేఁడు = కోరుకొను ; సంభావనలు = లాభములను ; భావ్యము = సంభ వము ; ఓఁపునే = తట్టుకొనఁగలఁడా? ; ఆరయన్ = పరిశీలింపఁగా.

**16 వ పద్యము :-** తోరములౌ = పెద్దవి యగు ; గ్రంథ-సభా+ఉపదేశ-సంభా రము తోఁడన్ = పుస్తకములు, ఉపన్యాసములు మొదలగు సన్నాహములతో ; నీ పథమున్ = నీ దారిని ; చూడన్ = పరిశీలింపఁగా ; భక్త-సేవా-రతిన్ = నీ భక్తులకు సేవ చేయవలె ననెడి ఆసక్తితో ; ఏక-జన = ఒకే వ్యక్తి గలిగిన ; వాహినివి+ఐ = సైన్యమవై (one man army) ; మెట్టి = కాలుపెట్టి ; నీ యెడలన్ = నీ పట్ల ; నిష్ఠన్ = శ్రద్ధను ; కఱంచితి = నేర్పితివి.

**17 వ పద్యము :-** వేల శరత్తుల+ఆయువునన్ = వేల కొలఁది సంవత్సరముల ఆయుర్దాయముతో ; విష్ణు-మహేశ-చతుర్ముఖ+అంశలన్ = బ్రహ్మ-విష్ణు-మహేశ్వరుల అంశలతో ; గ్రాలెడి = విరాజిల్లెడి ; పర+ఆత్ముఁడవు =

పరమాత్ముఁడవు ; అంతయె = అంతే.

<u>**18 వ పద్యము :-**</u> భ్రాఁతిగన్ = భ్రాంతితో ; దేవతా-జనన-భంబులన్ = దేవతల జన్మనక్షత్రములను ; తేల్చెడువారు = నిర్ణయించువారు ; సంతునకున్ = తమ సంతానమునకు ; ఆ+అభిధానము+**ఉం**చుటన్ = "బాగులేని జాతకములు గల దేవుళ్ళు/ దేవతలు" అని తామెవటిని గూర్చి తలంచుచున్నారో వారి పేర్లు పెట్టుటను ; ; మురారాతిగన్ = విష్ణుమూర్తిగా ; అక్కజకారులె? = ఆశ్చర్యమును గలిగించువారా?

<u>**19 వ పద్యము :-**</u> నవగ్రహ+**ఆ**వళివి = తొమ్మిది గ్రహముల వరుసవు ; సమస్త = అన్ని పురా+అవతారముల్ = పూర్వపు అవతారములున్ను ; ఫల-ప్రదాతవు = ఫలముల నిచ్చువాఁడవు ; అవనీ = భూమిమీఁది ; జన = ప్రజల యొక్క ; కర్మలకు = పనులకు ; ధాతవున్ = బ్రహ్మవు కూడను ; కృతాంతుఁడొ = యముఁడవు ; నిధన-నిర్ణయమందునన్ = మరణ సమయమును నిర్ణయించుటలో ; సర్వ = అందఱి చేతను ; సంభావిత = గౌరవించబడు ; తపస్వులకున్ ఎల్లను = తపస్వులందఱికిని.

<u>**20 వ పద్యము :-**</u> ఉజ్జగించియున్ = వదిలిపెట్టినను ; తత్+ఏక = అదే/ అటువంటిదే అయిన ఒక ; దయా+**ఆ**ర్ద్రత మైన్ = దయార్ద్ర తత్త్వముతో ; బాహిర-లోక = బయటి ప్రపంచపు ; కాఁచుచున్ = కాఁపాడుచు ; కఱచు = నేర్పునట్టి ; కననౌదురె = కనిపించెదరా? ; లాఁతులు = ఇతరులు.

<u>**21 వ పద్యము :-**</u> ఆగమ = వేదములచే ; బోధిత = బోధింపఁబడిన ;



లక్షణము+ఐన = సాంప్రదాయికమైన ; తంత్రముల = కర్మకాండల ; లంపయున్ = మొత్తమున్ను ; అనవశ్యము = అనవసరము ; ఏరికిన్ = ఎవఱికి ; నీ ముఖ = నీ నోటి నుండి ; నిర్గత = వెలువడిన ; ఉక్తి = మాట ; దివ్య+అక్షి-విలాసముల్ = పావనమైన చూపులు.

<u>**22 వ పద్యము :-**</u> ఆయుః + అనామయత్వములున్ = ఆయుర్దాయము మఱియు ఆరోగ్యమును ; ఐశ్వరమున్ = ఐశ్వర్యమును ; నిజ = స్వంత ; పరేత-వల్లభ = యముని యొక్క ; విధి = బ్రహ్మ యొక్క ; ఇంద్ర = ఇంద్రుని యొక్క ; సుధా+**అ**బ్ధి-కుమారి = లక్ష్మీదేవి యొక్క ; సమ్మతుల్ = అనుమతులు ; వే = వేయి ; స్వీయ = (మీ) స్వంత ; కృపామయ = దయతో కూడిన ; దృక్-ప్రసారమే = చూపులను సారించుటయే ; ఈరు = మీరు.

<u>**23 వ పద్యము :-**</u> కోటి-శరత్+సమూహమునకున్ = కోటి సంవత్సరముల మొత్తమునకు ; లోటుగన్ = అరుదుగా ; పాటిల**న్+పో**లున్ = సంభవింపవచ్చును ; ప్రతిభానము = గొప్పతనమును ; మేటులు = గొప్పవారు/ అదృష్టవంతులు ; శేష-కాల-జనము = మిగత యుగములలో జన్మించినవారు.

<u>**24 వ పద్యము :-**</u> స్రావిని = వరుసగా ; ప్రభృతి= మొదలైన/ ఇత్యాది ; పాఱుటకున్ = ప్రవహించుటకు ; మానవ+ఆత్మ+అవని మీఁదన్ = మానవుని ఆత్మ అనెడి నేల మీఁద ; ఏ + అభిధ మైన్ = ఏ పేరుతో ; ఏరు =

ఎవఱు ; నీవయి = నీవే స్వయముగా ; అనిష్టములందునన్ = అనర్థముల లో.

**25 వ పద్యము :-** లవణ-జలంబులందున్ = ఉప్పునీళ్ళలోను ; సరళ+**అం**బువులందును = మంచినీళ్ళలోను ; నివసనము+**ఉం**డున్ = కాపురముండును ; విలయము = నాశనము ; నిదేశమె = ఆజ్ఞయే ; కలదే? = ఉన్నదా?

**26 వ పద్యము :-** రుజా-విశేషమునన్ = విశేషమైన (ప్రత్యేకమైన) రోగముతో ; యమ+**ఉ**పకంఠమున్ = మృత్యుదేవత సన్నిధికి ; గ్రక్కునన్ = వెంటనే ; స్రుక్కి = బాధపడి ; నిక్కపు+ఇచ్ఛ = సత్యసంకల్పము ; ఇచటన్ = ఈ విషయములో.

**27వ పద్యము :-** వక్కణలు + **ఈ**యన్ = సందేశములిచ్చుటకై ; జాబులు = లేఖలు ; దూరవాణియున్ = టెలిఫోన్ కూడ ; చక్కికిన్ = దగ్గఱకు ; చేఱన్ రాన్ = చేఱ వచ్చుటకు ; అ-సాధనముల్ = సాధనములు కావు ; పొగబండ్లున్ = ట్రెయిన్లు మఱియు ; పుష్పకాల్ = విమానములు ; మిక్కుటంబు+**అ**యిన = అధికమైన ; ఎన్నఁగన్ = ఆలోచింపఁగా.

**28 వ పద్యము :-** వెక్కసమౌ = దుర్భరమగు ; తమమందున్ = చీఁకటిలో ; వేయి-వెలుంగు-ఱేఁడు = సూర్యుఁడు ; ఎల్లన్ = అన్ని ; అక్కరణిన్ = ఆ+కరణిన్ (ఆ విధముగానే) ; దురితంబులు = పాపములు ; అవిద్యయున్ = అజ్ఞానము కూడ ; చిర-స్థాయులె = చాల కాలమునుండి ఉన్నటువంటివే



క్షాళనము + ఔన్ = కడుగుకొని పోవును.

**29 వ పద్యము :-** **అ**న్నిటన్ = అన్నిటిలోను ; శేషితుల్ = మిగతవారు ; బహు = పెక్కు ; గత = పూర్వ ; ఉద్భవ = జన్మలకు చెందిన ; కర్మములన్ = కర్మ ఫలములను ; భుజించు = అనుభవించు ; నాడు = రోజున ; అన్నరు = ఆ+నరు (ఆ మానవునికి) ; బాసట = సహాయము ; తామొ? = మఱి మీరో ? ; మొదల్ = అసలు ; మన్నుగన్+చేసి = నాశనము చేసి ; మన్గడ = జీవితము.

**30 వ పద్యము :-** వాదు వైచినన్ = అపనింద వేసినను ; నెఱ+వగన్ + చెంది = పూర్తిగా విషాదమును పొంది ; కుందుట = బాధపడుట ; అనిష్యము = అవాంఛనీయము ; దేశిక! = హే సద్గురూ! ; ఇచ్చితి+ఏనిన్ = నీవు ఇచ్చినచో ; వే = వేగమె (శీఘ్రముగా) ; దవ్వు+**అ**యి = దూరమై ; మాఁటుమణ్గును = అణఁగిపోవును ; వ్యథా+ఆవళి = బాధల వరుస ; సాంతము = మొత్తమున్ను.

**31 వ పద్యము :-** వంచన-మూలకంబులును = మోసము చేయుటయే ముఖ్యముగా గలవియు ; వాక్+గత = వాక్కులకు సంబంధించిన ; పాప = పాపములకు ; సమాశ్రయంబులున్ = నెలవైనవియు ; ప్రశ్రితత్వమున్ = వినయమును ; త్రుంచెడు = నాశనము చేయు ; కర్మలు = పనులు ; ఈశ-గురు-దూర-కరంబులున్ = దేవునికి, సద్గురునికి దూరము చేయునట్టివియు ; అన్యజీవి = వేఱే జీవులను ; హింసా+అంచితమైన = హింసించుటతో

కూడుకొన్న.

**32 వ పద్యము :-** ప్రత్న-తస్కరులము = ప్రాఁత దొంగలము ; రక్షి-వర్గపున్ = భటశాఖ (Police Department) యొక్క ; తీరుగన్ = విధానమున ; ప్రాక్ = పూర్వము ; కృత= చేసిన ; అఘ = పాపముల ; సమితి= గుంపు ; బహిః+గమింపన్ = బయటికి పోవుటకు ; ఆరసి = చూచి.

**33 వ పద్యము :-** పఠింపఁగన్ లేను = చదువఁజాలను ; నైష్ఠికతచే = దీక్షతో ; ఒక్క ప్రొద్దులున్ = ఒంటిపూటి పస్తులు ; పలు = అనేకమైన ; కాయము = శరీరము.

**34 వ పద్యము :-** చొచ్చినది+ఎల్లన్ = ప్రవేశించిన ప్రతిదియు ; పటిష్ఠ = అత్యంత బలీయమైన ; తాన్ = తాను ; గడియించినది+ఎల్లన్ = సంపాదించిన ప్రతిదియు ; గర్వము+ఔన్ = గర్వముగా పరిణమించును ; కూచితనంపున్ = పిల్లతనపు ; చేష్టలు = చేఁతలు ; ఇటు = ఈ విధముగా ; ఎటులు = ఎట్లు/ఏ విధముగా.

**35 వ పద్యము :-** వాంఛిత = కోరికలు ; పూర్తికి = నెఱవేఱుటకై ; బాహిర+అంగణము = బయటి స్థలము ; చొక్కెదరు = సుఖించెదరు ; స్వ+ఆత్మను = తమ మనస్సులో ; లయము+ఐ = లీనమై ; భజింతురు = అనుభవించెదరు ; అతిలోక = ఇహలోకమునకు అతీతమైన ; విముక్తిని = మోక్షమును.



**36 వ పద్యము :-** పసిఁడి-చేలములున్ = పట్టుబట్టలును ; విపుల+అలికంబునన్ = విశాలమైన నుదుటి మీఁద ; రమ్య = హృద్యమైన ; పదార్థ-విశేష = ప్రత్యేకమైన దినుసులు ; మిశ్రిత = కలిపిన ; అన్న = ఆహారములున్ను ; ఆసవముల్ = రసములు ; మనంబునన్ = మనస్సులో ; నివేదనంబులు+ఈన్ = నైవేద్యములను ఇచ్చుటకు ; ఉభయ-దాయక = ఇహపరములను ప్రసాదించువాఁడా! ; నాయక! = అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకా !

**37 వ పద్యము :-** నిరత = ఎల్లప్పుడును చేయు ; ఋక్ = ఋగ్వేదము ; యజుః – యజుర్వేదము ; ఆదిక = మొదలైన ; పాఠము = పఠనము (పారాయణ) ; జిష్ణు = జయాత్మకమైన ; భ్రాజిష్ణు = ప్రకాశమానమైన ; శుభ+ఆహ్వాయంబె = శుభనామమె ; ప్రణవంబు = ఓంకారములు.

**38 వ పద్యము :-** అహరహము = ప్రతిరోజు ; ఆత్మన్ = మనసులో ; మొల్లము = ధనము ; హరి = విష్ణువు యొక్క ; హర = శివుని యొక్క ; ప్రజాపతి = బ్రహ్మ యొక్క ; విలాసులరౌ = లీలలు గలవారగు ; మాఁటుపుచ్చి = మఱుగున పడవేసి ; లోన్ = లోపల (మనసులో) ; యశము = కీర్తి ; అయ్యది = అది ; స్వవం.శ = తన వంశములో ; జాత = పుట్టిన ; హతకులు (ఇది ఒక తిట్టు) = చచ్చుగాళ్ళు.

**39 వ పద్యము :-** స్వచ్ఛ = పరిశుద్ధమైన ; మనంబునన్ = మనస్సుతో ; తెలియన్ = గ్రహించినచో ; హుళక్కి = శూన్యము ; భవత్ +ఇష్టము = నీ

సంకల్పము ; లేక = లేనిచో ; ఘటిల్లదు = జఱుగదు. త్వత్ = నీ యొక్క ; శుభ = శ్రేయస్కరమైన ; శేముషిన్ = మేధాశక్తిని ; మొఱఁగి = మోసగించి ; ఒక జీవియున్ = ఒక్క జీవియైనను ; డాఁగన్+నేర్చునే? = దాఁగుకొనఁ గలదా? అచ్ఛము = యథార్థమైనది ; ఇడక = ఇవ్వకుండ ; తానుగన్ = దానంతట అది.

**40 వ పద్యము :-** అసమానమైన = సాటిలేని ; భవదీయ = మీ యొక్క ; సూ! = చూడుమా! ; అఖిలంబున్ = అంతయును ;

**41 వ పద్యము :-** పొడమిన = (మేము) పుట్టిన ; పుణ్య-యుతంబులు = పుణ్యముతో కూడుకొన్నవి ; ప్రజ్ఞలున్ = (మా) మేధాశక్తులు ; పొడవులు = గొప్పవి ; సంగములు = (మా) సాంగత్యములు ; పూతము = పవిత్రము ; పురా = పూర్వము ; కృత = చేసిన ; అఘముల్ = పాపములు ; జడములు = అచేతనములు ; తత్త్వములు = (మా) స్వభావములు ; సత్= మంచి ; పథ = దారిలో ; గాములు = పోవునట్టివి ; మతి = ఆలోచన ; మహీయ = గొప్ప ; ఉదారత = అనుగ్రహము.

**42 వ పద్యము :-** నికరము = గుంపు ; ఓసరిలి = తప్పిపోయి ; నిర్+జన = నిర్మానుష్యమైన ; గర్జన = (క్రూరమృగముల) గాండ్రింపులతో ; తర్జన = భయపెట్టెడి ; అటవిన్ = అడవిలో ; మనీషన్ = బుద్ధితో ; క్రుమ్మఱెడు = తిరుగాడునట్టి ; విహ్వల = బెదిఱిపోయిన ; వత్సములంటి = దూడల వంటి ; త్వదీయ = నీ యొక్క ; శమ= ప్రశాంతి ; మేదుర = నిండిన ; సాత్వత =



భక్తులనెడి ; గోష్ఠ = గోనిలయపు ; గోష్ఠిలో = సత్సంగములో.

**43 వ పద్యము :-** పొనర్పన్ = చేయుటకు ; విశేష మనీష = గొప్ప మేధాశక్తి ; ప్రాక్ = పూర్వము ; సంచిత = సంపాదించిన/ ప్రోగుచేసుకొన్న ; సదేహ = సజీవ ; అంచిత = గౌరవనీయమైన.

**44 వ పద్యము :-** అగణిత = అనంతమైన ; కర్మపాశమునకున్ = కర్మ అనెడి త్రాటికి ; ఐహికపున్ గడన్ = ఇహలోకమనెడి రాటతో ; ధేను-గణము = ఆలమంద ; సాఁగు దన్కన్ = సాఁగు వఱకు ; అటు+అయ్యున్ = అట్లయిన ప్పటికిని ; తెగువకున్ = తెంపరితనమునకు.

**45 వ పద్యము :-** తనుమాత్రక = తనువు మాత్రమే (శరీరమే) చేతనుండన్ = చైతన్యముగా భావించువాఁడను ; సత్+లాప = మంచిమాటలకు ; విదూరుఁడన్ = దూరమైనవాఁడను ; ద్రవిణ-లాభ-గత+ఆత్ముఁడన్ = ధనలాభము నందు మనస్సు గలవాఁడను ; ధర్మ+అపర-రావణుండన్ = ధర్మమాచరించుటలో మఱియొక రావణుని వంటివాఁడను (అనఁగా – ధర్మాధర్మముల మిశ్రమ స్వభావిని) ; పరమ+ అనుకంపన్ = గొప్ప దయతో.

**46 వ పద్యము :-** చొచ్చి = ప్రవేశించి ; కాయములందు = శరీరముల మీఁద ; ఇసుమంత బూదియున్ = కొంచెము బూడిద అయినను ; పలుతిప్పల = అనేక విధములైన కష్టములతో కూడుకొన్న ; గార్హపత్యమున్ = గృహస్థాశ్రమమును ; పాలన+చేయన్ = పాటించునప్పుడు ; ఆఱు పరిపంథులు = ఆఱు శత్రువులు (కామ-క్రోధ-మద-లోభ-మాత్సర్యమోహములు) పుణ్యాకోశమున్

= పుణ్యమనెడి నిధిని ; లీలన్ = సులభముగా.

**47 వ పద్యము :-** తాపస నిష్ఠలు = తపో నియమములు ; నేర్వన్ +ఐతిన్ = నేను నేర్వలేదు ; తత్+అంతిమ రూపము = వాని పర్యవసానము ; ప్రాక్+ జనుః = పూర్వజన్మను గుఱించిన ; మర్మము = రహస్యము ; మత్+విదిత మైన = నాకుఁ దెలిసిన ; విపత్+తరణ+అయనంబు = ఆపదను దాఁటు మార్గము (ఉపాయము) ; శర్మ-చయ = సుఖముల గుంపులను ; ఆవహా + ఆవహింపఁజేయు ; అంఘ్రి-యుగ = పదముల జంటను ; సంగ్రహణంబు = గట్టిగా పట్టుకొనుట.

**48 వ పద్యము :-** నరునకున్ = మానవునకు ; శ్రేయమున్ = మేలు/మంచి ; కూర్పన్+నేర్చునే? = సమకూర్పఁగలఁడా? ; పరులకున్ = ఇతరులకు ; బాసట పేరిటన్ = సహాయము పేరుతో ; ధన+ఆహరణమె = డబ్బు గుంజు కొనుటయే ; ఇలన్ = ఈ ప్రపంచములో ; ఆదరమునన్ = ప్రేమతో ; కూర్పఁ జాలు = సమకూర్పఁగల.

**49 వ పద్యము :-** లోక-విగర్హిత = లోకముచేత నిందింపఁబడు ; చేపడన్ = చేకూడునట్లుగా ; దాఁపునన్ = దగ్గఱలో ; లేక = ఉండక ; తత్+సముఖం బునన్ = ఆ పాపపురుషుని ఎదుట ; ఏఁపు+అఱి = ఎదుగుదల లోపించి ; చిక్కెన్ = బక్కచిక్కిపోయెను ; వీనిన్ = (మాలోని) ఈ పుణ్యపురుషుని ; బలదీపితున్ = బలముతో ప్రకాశించువానిగా.



**50 వ పద్యము :-** ఎల్లఱియందున్ = అందఱిలోను ; కలరు = ఉంటిరి ; ఇద్ధరన్ = ఈ+ధరన్ = ఈ భూమిపై ; చెల్లును = లెక్కలోనికి వచ్చును ; ఏఁచినటు = బాధపెట్టినట్లు ; చేతన మాలి = బుద్ధి లేక ; గత+ఉద్భవంబు లన్ = పోయిన జన్మలలో ; పెల్లుగన్ = ఎక్కువగా ; లాఁతులన్ = ఇతరు లను ; ఎఱియన్+పెట్టినచోన్ = బాధపెట్టినచో (ఎఱియు=బాధపడు) ; క్షమ వేఁడెదన్ = క్షమార్పణ వేఁడుకొందును ; ఉల్లమునందున్ = మనసునందు ; కైకొని = స్వీకరించి ; శుచిన్ = పవిత్రునిగా.

**51 వ పద్యము :-** అల్లన దూరము = అల్లంత దూరము ; గర్హిత = నిందార్హ మైన ; దుష్ట-చేష్టుఁడనె = చెడ్డ పనులు చేయువాఁడనే ; పురిన్ = పింఛముల సమాహారమును ; బర్హి = నెమలి ; విదల్చి యాడన్ = విప్పి ఆడఁగా ; స్వః+ హిత = స్వర్గలోక జీవితపు, అనఁగా సద్గతుల విషయములో (భక్తులకు) హితము (మేలు) చేయువాఁడా! సాధువన్ = మంచివాఁడను. (పక్షాంతర ములో) సర్వసంగ పరిత్యాగిని.

**52 వ పద్యము :-** పగతుఱము = శత్రువులము ; ఏమె = మేమే ; ప్రతిపక్షులు = శత్రువులు ; ఖగములు = గ్రహములు ; క్రూరతన్ = క్రూరత్వముతో ; చలు పఁగా = చేయుటకై ; సరిపోలరు = సాఁటిరారు ; ఒగిన్ = వరుసగా : ఒనరించు = చేసికొను ; సత్ = మంచి ; అసత్ = చెడు ; వివేకము+ఇడి = వివేకమును ఇచ్చి.

**53 వ పద్యము :-** శైలములున్ = కొండలను కూడ ; గంగి = పవిత్రమైన ;

ఏఱులున్ = నదులను కూడ ; మొదలు = ఇత్యాదులను ; కాంచితిన్ = చూచితిని ; వజ్రలేపముల = సున్నపు పూఁతల యొక్క ; (ఒకప్పుడు సిమెంటునకు బదులుగా గానుగ సున్నము వాడెడివారు); ధోరణి = విధానమున ; కుటీచకుండన్ + ఐ = ఒక స్థిరమైన చిన్న కాపురమునందు స్థిరపడినవాడనై ; విలువ+అగు = అమూల్యమైన ; పద-ద్వయమున్ = పాదముల జంటను ;

**54 వ పద్యము :-** పుణ్య = పుణ్యమనెడి ; సమాహ్వాయంబు+అయిన = పేరు గలిగిన ; పుత్తడి = బంగారు ; లావణ్య = సౌందర్యముతో ; వరేణ్యము+ఔ = శ్రేష్ఠమగు ; చిలుక-వైనమునన్ = చిలుక విధముగా ; ఇడన్+పోకు = పెట్టఁబోకు ; బందిగాన్ = ఖైదీగా ; కొమ్ము = కొనుము (తీసికొనుము) ; బ్రహ్మణ్య-పదంబు = మోక్షస్థితి ; ఒసంగి = ప్రసాదించి.

**55 వ పద్యము :-** పెన్+ = పెను (పెద్ద) ; అతిపేశల = మిక్కిలి మృదువైన (చాల మంచితనము గలిగిన) ; వర్తనన్ = ప్రవర్తనతో ; మంజు-తర = మిక్కిలి మనోహరమైన ; అధికారులు+అయి = అధికారము గలవారై ; మాన్యతన్ = (సమాజ) గౌరవమును ; ఒందిరి = పొందిరి ; బందికోటిపై = కోటులాదిగా ఉన్న ఖైదీల మీఁద (సామాన్యమైన పుణ్యబలము మాత్రమే గల మిగిలిన ప్రజల మీఁద) ; రంజిల+ఏల? = ఆనందించుట ఎందుకు? ; చెఱన్ = చెఱసాలలో రంజుగన్ = ఆనందముగా ; బైలువారుటె = నర+ఆత్మకున్ = మానవుని ఆత్మకు.



**56 వ పద్యము :-** చరించును = తిరుగును ; తురంగముల్ = గుఱ్ఱములు ; అంచున్ = అనుచు (అని) ; ఎంచున్ = భావించును ; నిజ = తన/ తమ యొక్క ; కర్తను = సృష్టికర్తను లేదా యజమానుని ; ముదల ప్రకారము = ఆజ్ఞ ప్రకారము ; విముక్తులము = స్వేచ్ఛాజీవులము ; అందుము = అని చెప్పుకొందుము.

**57 వ పద్యము :-** వలవదు = వలదు (వద్దు) ; న+ఏక = అనేకములైన ; రై = ధనములతోడను ; కనక = బంగారు ఆభరణములతోడను ; వాహన = వాహనములతోడను ; వస్తు = వస్తువులతోడను (సంక్రమించెడి) ; ఘన = గొప్ప ; ప్రశస్తియున్ = గౌరవముకూడ ; చతుః= నాలుఁగు ; సముద్ర = సముద్రములచేతను ; పరివారిత = చుట్టుముట్టఁబడిన ; విస్తర = సువిశాలమైన ; రాజ్య = సామ్రాజ్యము మీఁది ; సత్తయున్ = అధికారము కూడ ; వలవవు = వలదు ; నాక-లోక = స్వర్గలోకపు ; సుఖ-వాసనలున్ = సుఖముల రుచులు కూడ ; భృశ = గొప్పవైన ; కీర్తి-చంద్రికల్ = కీర్తులనెడి వెన్నెలలు ; వెలయఁగన్+ఇమ్ము = స్పష్టముగా స్ఫురించునట్లు ఇవ్వుము.

**58వ పద్యము :-** ప్రతిఫల = చేసిన పుణ్యకార్యముల ఫలములను ; భోగ-కాంక్షలకున్ = అనుభవింపవలె ననెడి కాంక్షకు ; పాల్పడి = దిగఁజాఱి ; కోల్పడు = పోఁగొట్టుకొను ; పారమార్థిక+ఉన్నతి = ఆధ్యాత్మికమైన ఉన్నత స్థితి ; అ+నశ్వరము+ఐ = నశించు స్వభావము లేనిదై ; పరమేష్ఠి-కోటి = కోటిమంది బ్రహ్మదేవుల యొక్క ; జీవిత-సమయ = ఆయుష్కాలమును

సైతము ; అధిగామి+అయి = మించిపోవునదై ; విచ్చు = వికసించు ; విత రణన్+చేయుము = దానము చేయుము ; అక్కటికన్ = దయను.

**59 వ పద్యము :-** హీనపు = హీనమైన ; లోని-హింసన్ = లోపలి (మానసిక) హింసాస్వభావమును ; వెలి-హింసయున్ = బయటి (ఆచరణాత్మకమైన) హింసను కూడ ; మనంబు = మనస్సు ; హంసపైన్ = సోఽహమ్ (ఆ పర మాత్మయే నేను) అను మహావాక్యము మీఁద ; ఆను విధానన్ = నిలచునట్లు ; ఆరయుము = చూడుము ; జన+ఈశ్వరతల్ = ప్రజానాయకత్వ హోదాల ప్రసక్తిని ; ప్రసభంబుగా = బలవంతముగా ; ఓసరిలన్ = తొలఁగిపోవుటకై.

**60 వ పద్యము :-** కర్మ-ఫల-భోగ-నిమిత్తమె = కర్మఫలములను అనుభవించుట కొఱకే ; ఏ గతిన్ = ఏ విధముగా ; ఎదన్ = హృదయమునందు ; వాసనల్ = (దుష్ట) సంస్కారములు ; ముంతపాగ పోలికన్ = ముంతపాగ వలె ; ఉక్కిరిబిక్కిరి+అయి చనెన్= తబ్బిబ్బైపోయినది ; వేగన్ = త్వరగా ; మత్+ ఆత్మ = నా ఆత్మ ; అక్కటిక వీవెనన్ = దయ అనెడి విసనకఱ్ఱతో.

**61 వ పద్యము :-** కలల తెఱంగులై = కలల విధమై ; కచ్చికలు = కరుడు గట్టిన బూడిదలు ; తలఁచినన్ = తాను గుర్తుకు తెచ్చుకొన్నను ; లాఁతివార లకున్ = ఇతరులకు ; వచించినన్ = చెప్పినను ; కలిగినది = ఇప్పుడు ఉన్నది (ఈ జన్మము) ; ఏష్యమందున్ = భవిష్యత్తులో ; స్ఫుట-వాక్కులన్ = స్పష్టమైన మాటలతో.



**62 వ పద్యము :-** క్రమ్మఱన్ = మఱల ; కల్గెదన్ = పుట్టెదను ; నిబద్ధి = నిశ్చ యము ; వన్యమ్ము+అయి = అడవిమృగమునై ; కాననంబుననొ = అడవి లోనో ; యాదమన్ +ఐ = నీటి జంతువునై ; జలరాశియందొ = సముద్రము లోనో ; కీటమ్ము+అయి = పురుగునై ; భూ-బిలంబులనొ = నేలలోని రంధ్ర ములలోనో ; ఎమ్మెయిన్ = ఏ+మెయిన్ = ఏ విధముగా ; ఏలుము = కాపా డుము/ నడిపింపుము ; కేల్ + కొని = చేయి పట్టుకొని.

**63 వ పద్యము :-** అంగము = శరీరము ; క్రమ్మఱన్ = మఱల ; జనిం పన్+కలవాఁడనో? = పుట్టబోవుదునో? ; భంగమున్+చెందునో? = భగ్న మగునో ; సుమతి = మంచి బుద్ధి ; పాటిలునో? = సంభవించునో? ; అ-సత్+సంగ-బలంబునన్? = చెడ్డవారి సాంగత్య ప్రభావమున.

**64 వ పద్యము :-** ఏష్యులన్ = భావితరములవారిని ; అనామయతన్ = ఆరో గ్యముతో ; పయిన్ = ఆ పైన ; మీసరమైన = శ్రేష్ఠమైన ; భవము+ఈఁత యున్ = భవసాగరమును ఈఁదుట కూడ.

**65 వ పద్యము :-** భవ+అంబునిధిన్ = జన్మములనెడి సముద్రమును ; తరిం పన్ = దాఁటుటకై ; ఏ వెరవున్ = ఏ ఉపాయము కూడ ; సుఖ+ఇచ్ఛ మెయిన్ = సుఖములను అనుభవింపవలె ననెడి వాంఛతో ; బహు = అనేక ములైన ; పాశ-జాలమున్ = త్రాళ్ళ అల్లికను ; తీవలు+అటంచున్ = పూల తీఁగలనుకొనుచు ; బహిః+ఆగమించు = బయటికి వచ్చు ; వెలి-లాఁగుము = బయటకు లాఁగుము.

**66 వ పద్యము :-** మత్త = మదించిన ; కరి+ఇంద్ర = గొప్ప ఏనుఁగు యొక్క ; మజ్జనము = స్నానము వంటిది ; మా త్వత్+ఉపాసన = మేము చేయు నీ ఉపాసన (అడవి ఏనుఁగు నెత్తిమీద నీరు చల్లుకొన్న తొండముతోనే బుఱద కూడ చల్లుకొనును) ; చిత్తము = మనస్సు ; మాలిమి+ఐన = మచ్చికైన ; నిజ-జీవము పోలికన్ = స్వంత (పెంపుడు) జంతువు వలె ; మిన్నకుండున్ = ఊరుకొనును ; ఆ+ఉత్తర-కాలమందు = ఆ తర్వాతి సమయములలో ; బహు+ఉగ్ర = మిక్కిలి దుడుకైన ; విచింతన-సేనకున్ = వేఱువేఱు ఆలోచనల సైన్యమునకు ; అగ్గము+ఐ = గుఱియై ; స్థిర-చేతన = స్థిరమైన మనస్సును ; ఇడు = ఇవ్వుము.

**67 వ పద్యము :-** ఇంచుక = కొంచెము ; కానన్ = కాఁబట్టి ; అవశ్యము+అగు = తప్పనిసరి అగు ; అక్కఱలన్ = అవసరములను ; మాలోన్ = మా మానవులలో ; తివుటల్ వినా = కోరికలే తప్ప ; శుభలోకన = మంచి-చెడు అనెడి దృష్టి ; ఎడన్ =హృదయమునందు.

**68 వ పద్యము :-** ఆర్త-శరణ్యా! = కష్టములలో ఉన్నవారికి దిక్కయినవాఁడా! ; "నీవ"+అని = నీవే అని ; ఐక్యమున్ = ఏకత్వమును ; ఎంచెదన్ = ఊహించుకొందును ; ఎఱింగినప్పటికిన్ = ప్రణమిల్లినప్పటికిని ; గురు = సద్గురుని పట్ల ; ప్రపన్నతా= భక్తి అనెడి ; వర్తనిన్ = దారిని ; వావిరిన్ = వరుసగా ; ఆవర్తముఁన్ +పోని = సుడిగుండము వంటి ; సంసృతిని = సంసారమునందు.



**69 వ పద్యము :-** ఏల+అని = ఎందుకని ; ఏన్ = నేను ; పెక్కు = చాలా ; యోగి-జన-స్తుత! = యోగులచే స్తుతింపఁబడినవాఁడా! చరణ-ద్వయంబు పయిన్ = పాదముల జంట మీఁద ; నిష్ఠలు = ఏకాగ్రత ; ఎంచి = భావించి ; ఎడంబు+ఐ = దూరమై ; చనన్+పోకు = పోవలదు.

**70 వ పద్యము :-** కొమరుమీఱన్ = సౌందర్యము ఉట్టిపడునట్లుగా ; ఉదగ్ర = ఉత్తమమైన ; అటు+కానన్ = అందుచేత ; అట్టి = అటువంటి ; పెన్ = గొప్ప ; మక్కువ తోడనే = ప్రేమతోనే.

**71 వ పద్యము :-** ఇంచుక = కొంచెము ; ఎల్ల+ఎడన్ = అన్ని చోటులందు (సర్వే సర్వత్ర) ; దుః+వినియోజితంబు = చెడ్డగా ఉపయోగింపఁబడునది ; షట్+పంచ = ఆఱు లేక అయిదు భాగములుగా ; విభక్తము = విభజింపఁబడినది (కుదురుగా ఒక వస్తువు మీఁద లేనటువంటిది) ; అల్ప = హీనమైన ; భంగుర = నాశనము చెందు స్వభావము గల ; వస్తువులందు ; సహితము = కూడ ; అఘ = పాపపు ; క్రియా = కృత్యములను ; సంచితికే = ప్రోఁగు చేయుటకే ; సత్+మతిన్ = మంచి మనస్సును గూర్పుము.

**72 వ పద్యము :-** స్వాదు = రుచ్యములైన ; పదార్థ-పంక్తి = పదార్థముల వరుస ; ఒక+ఇంతలోనె = కొలఁది సేపటిలోనె ; సమ్మోదము తోడుతన్ = ప్రీతితో ; దీనను = దీని వలన ; పుణ్య-హాని = పుణ్యనష్టము ; ఆదరము+ఊని = ప్రేమ పూని ; చల+ఆత్మక-తత్త్వమున్ = చలించు మనస్తత్త్వమును.

**73 వ పద్యము :-** ముఖర = బిగ్గరగా చేయు ; స్తుతి-పూజనము+ఆది = స్తోత్రములు మఱియు పూజ మొదలైన కార్యకలాపము ; శ్రుతి-పుట = చెవి దొప్పల యొక్క ; యుగ్మమున్ = జంటను ; దఱియుచుండునొ = చేఱు చుండునో ; ఎఱుంగరాదు = తెలియదు ; దుః+మతిని = ఒక చెడ్డ వాలక ములో ; (నిన్ను గుఱించి) అధరము = పెదవి ; ఆడిన = పలికిన ; నిష్ఠుర-భాష = కటువైన మాటలు ; మట్టుకున్ = మాత్రము ; శత-గుణము+ఐ = నూఱురెట్లయి.

**74 వ పద్యము :-** వదులు-మనస్సుతో = గట్టి పట్టుదల గానీ ఇంద్రియ నిగ్ర హము గానీ లేని మనస్సుతో ; భువన-వాసనకున్ = లౌకిక సంస్కారములకు ; క్రమ్మఱన్ = మఱల ; ఘటిల్లక+ఉండునటులు = జఱగకుండునట్లు ; ఆశీ షులు = ఆశీస్సులు.

**75 వ పద్యము :-** నశ్వరమైన = నశించు స్వభావము గలిగిన ; ఆలయ = ఇల్లు ; అంతరించుటన్ = క్షయించుట వలన ; విశ్వసనంబు = నమ్ముట ; వెన్కటి = పూర్వపు ; సత్త్వమున్ = సాత్త్వికగుణము కూడ ; ఈశ్వర-మైత్రి = భగవంతునితోడి సంబంధము ; యిడన్-వలదు = ఇవ్వవలదు ; ఇయ్యది – ఇదే.

**76 వ పద్యము :-** ఆమయ = రోగములకు ; నిర్జితము = లొంగినట్టిది ; అంగ-విరూపితము = అంగవైకల్యముచే వికారముగా ఉన్నటువంటిది ; ఐనన్ = అయినప్పటికిని ; ఉర్విన్ = ఈ భూమి మీఁద ; ఏ వామయున్ = ఏ



స్త్రీయు ; వార్ధక= ముదుసలితనముచే ; జర్జరితంబున్ = శిథిలము కూడ ; ఇసీ! = ఛీ! ; నరజాతికిన్ = పురుషజాతికి ; లోన్ = లోపల (మనస్సునందు) ; కళేబర-ప్రేమము = శరీరాభిమానము.

**77 వ పద్యము :-** న+ఏక-రీతి = అనేక విధములైన ; సత్+మానసిక-ఆశ యంబులు = (వ్యాకరణపరముగా ఇది వైదిక సంధి) మనస్సులో నున్న మంచి మంచి ఆదర్శములు ; త్వత్+అనుగ్రహము = నీ అనుగ్రహము ; ఒండు = ఒక్కటి ; దానను = దాని వలన ; మహత్ = గొప్ప ; ఆయుః+ అనామయతా = ఆయురారోగ్యములు ; విభూతులే = మానుగ = చక్కగా ; మాననీయములు = గౌరవింపఁదగినవి.

**78 వ పద్యము :-** తొండనికిన్ = ఒక్కొక్క భక్తునికి ; ఒక్క రూపమునన్ = ఒక్కొక్క రూపముతో ; కాఁతువు+అనంగన్ = కాఁపాడెదవు అని చెప్పఁగా ; భాగవతులు = భక్తులు ; ఆలకించి = శ్రద్ధగా వినిపించుకొని ; మెండుగన్ = బాగుగా ; మేలు+ఒనరింపవె = మేలు చేయవా?

**79 వ పద్యము :-** ఇలన్ = ఈ ప్రపంచములో ; ఒద్దిక = (తమ కౌఁగిటిలో) ఒదిగిన ; జత = సాహచర్యము ; తమఱి మ్రోలను = మఱియు మీ సన్నిధాన ములోను.

**80 వ పద్యము :-** చనున్ = పోవును ; సర్వరీతులన్ = అన్ని విధములుగా ; పులస్త్య-పౌత్రు = పులస్త్య మహర్షి మనుమఁడైన రావణాసురుని ; చందమ్మునన్ = విధముగా ; స్వీయ = తన ; దుః+మతికి = చెడ్డ ఆలోచనలకు ;

ఇమ్ముగన్ = బాగుగా ; రేఁగున్ = చెలరేఁగును ; నిః+మమతా-మిషన్ = (నాది ఏమియు లేదు) భగవంతునికే సర్వసమర్పణమను నెపమున.

**81 వ పద్యము** :- దీర్ఘ = చాలా కాలము ఉండునట్టి ; శత+ఆయుషంబు = నూటేండ్ల జీవితకాలము ; అదియున్ = అది కూడ ; తేలికయే = హీనమైన దే ; ఘన = గొప్పదైన ; కాల = కాలమనెడి ; వాహినిన్ = ప్రవాహమునందు ; దుర్ఘటము = అసంభవము ; నిః+ఘృణ = దయలేని ; జీవిత = జీవితము చే (ఇక్కడ జీవితమే ఒక దయలేని వ్యక్తిగా ఉత్ప్రేక్షింపఁబడినది) ; ప్రహరణీ యుఁడు = కొట్టఁబడువాఁడు ; గడింపన్ = సంపాదించుట ; పావన = పవి త్రుఁడున్ను ; అనర్ఘ = అమూల్యమైనవాఁడున్ను (అయిన) ; గురు+ ఉత్తమున్ = గురువర్యుని ; పనుపుము = పంపించుము.

**82 వ పద్యము** :- సింధు = ఏఁడు సముద్రముల వఱకు, మఱియు ; దిక్+ అంత = ఎనిమిది దిక్కుల అంచుల వఱకు ; పరీత = వ్యాపించిన ; సజీవు లైన = ప్రాణముతో ఉన్న ; తఱి దన్కనె = కాలము వఱకే ; మాన్యతలున్ = గౌరవములున్ను ; కామన = కోరిక ; అభవ-గమ్యమె = భవములు (జన్మ ములు) లేకపోవుట అను గమ్యమే.

**83 వ పద్యము** :- చన్న (చనిన) = పోయిన/ కడచిపోయిన ; హిమంబు = మంచు ; స్వప్నకల్పము+ఐ = కల వంటిదై ; ఆరసినదే = చూచినదే ;



మన్నదె మన్నున్ = బ్రతికిన బ్రతుకే బ్రతుకుచు (అనగా ఎత్తిన జన్మలే మఱల మఱల ఎత్తుచు) ; వేసఁటలు = విసుగు భావనలు.

**84 వ పద్యము** :- క్రీడనకాలు = ఆటవస్తువులు ; అమూల్యములు = వెలకట్ట లేనివి ; అ+కృత్రిమ = అమాయకుడైన ; పోతునకున్ = పిల్లవానికి ; అక్కు మారుఁడే = ఆ+కుమారుఁడే (ఆ పిల్లవాడే) ; కోఁడె-వయస్కుఁడు = యౌవన వయస్కుఁడు ; కొమ్మల = యువతుల ; అర్మిలి = ప్రేమ ; ప్రాణ-ధారకంబు = జీవితమునకు ఆధారము ; ఈడు = వయస్సు ; గతింపన్ = కడచిపోఁగా ; పిమ్మటన్ = తరువాత ; జనతా+అధికారమున్ = ప్రజలమీఁది అధికారమును ; వేఁడున్ = కోరును ; ఏము = మేము ; జన+ఆశ్రిత! = జనులచే ఆశ్రయింపఁబడువాఁడా!

**85 వ పద్యము** :- అన్+అస్తితా-భ్రమము = దేవుఁడు లేఁడు అనుకొనెడి భ్రమ ; నీ లవలేశమున్ = నీ అంశను ; కనఁగన్-నేఱని = చూచుట చేతఁగాని ; దుస్సహ = దుర్భరమైన ; నిస్సహాయతల్ = బలహీనత ; శ్యాలకులు + బావ మఱఁదులు ; అ+యాచిత = అడుగకుండనే ఇవ్వఁబడ్డ.

**86 వ పద్యము** :- ఇంపు+అరఁగన్ = సంతోషము కలుగునట్లు ; పాఁపితి కావు+అని = పోఁగొట్టితివి కావని (నీవు పోఁగొట్టలేదని) ; అ+కాల-మృత్యువునన్ = వయస్సు కాని వయస్సులో వచ్చిన చావు వలన ; వాడిరి+అటంచున్ = నశించిరి అని పలుకుచు ; నేఱమె? = నేఱమా ? ; కొనన్ = తీసికొనఁగా.

**87 వ పద్యము :-** బానిస-దుఃస్థితికిన్ = బానిసతనపు దుర్దశకు ; ఉబ్బినట్టులే = మనస్సులో పొంగిపోయినట్లే ; శ్వానము = కుక్కన్ ; స్వీయ-కంఠమునన్ = తన మెడలో ; సంకెలన్ = ఇనుప గొలుసును ; మదించినట్టులే = మద మును (గర్వమును) పొందినట్టులే ; ఆత్మఖేదముల = తమ విషాదముల ; మాఁటునన్ = వెనుక ; డాఁగిన = దాఁగి ఉన్న ; హేతులు+ ఏవొ = కారణములు ఏవైతే ఉన్నవో ; అవ్వాని = అ+వాని (అట్టివానిని) ; గడించి = ప్రోఁగుచేసుకొని ; వర్యులము = శ్రేష్ఠులము ; ఏము+అని = మేము అని.

**88 వ పద్యము :-** ఱేని = రాజు యొక్క ; పొడమి = పుట్టి ; నిదేశము చొప్పు నన్ = ఆజ్ఞ ప్రకారము ; నియోగ+అనుగుణంబుగాన్ = తనకు అప్పగించిన ధర్మమునకు అనుగుణముగా ; విధులన్ = కర్తవ్యములను ; కాన్+ఒనరించు చున్ = పూర్తిచేయుచు ; మెల్లన్ = మెల్లగా ; లీన-మనస్కుఁడై= తాదాత్మ్య ము చెందినవాఁడై ; భృతక = జీతముగా వచ్చునట్టి ; రిక్థమె = ధనమే ; ఏను+అని = నేను అని ; నరుని + ఈఁడులు = మానవునితో సమానులు.

**89 వ పద్యము :-** కోర్కెలన్ = కోర్కెలతో ; బహువిధీకృత = నానావిధ ములుగా కల్పించుకొన్న ; రాగములన్ = అభిమానములతోను ; మనో జగద్ = మానసిక ప్రపంచములోని ; వీరములన్ = ఆవేశములతోను ; భ్రమంబులన్ = భ్రమలతోను ; భవిష్య = (మా) రాఁబోవు ; జనుఃకథన్ = జన్మముల కథను ; ఔతివ్రాతలై = (చెఱుపుటకు వీలుకాని) శిలాక్షరముల



వలె అయి ; పేఱఁగన్ = కఱుడుగట్టునట్లు ; అతిపేలవ = (ఎవఱున్ను చదువలేని) మిక్కిలి సూక్ష్మమైన (అదృశ్యరూపములో ఉన్న) ; దూఱెదము = నిందించెదము ; అస్మత్ = మా యొక్క ; ఆత్మ-పథ-దూరతకు = ఆధ్యా త్మిక మార్గము దూరమైనందులకు.

**90 వ పద్యము :-** ఇలన్ + కూర్చి = ఇహలోకమును గుఱించి ; మంచి వచియించుటకు = మంచిగా మాటలాడుటకు ; స్వీయము+ఔ = తనది అగు ; సోయగము = అందమును ; అసు శోభ = జీవకళ (అసువులు = ప్రాణములు) ; కామినీ పిశాచాయితము = కామినీ పిశాచమును పోలినది ; వెసన్ = శీఘ్రముగా ; చక్కన+చేయన్ = బాగుచేయుటకు ; కడంగుచోన్ = పూనుకొన్నచో ; అఘంబే = పాపమే ; ప్రక్రియన్ = ప్రక్రియలో భాగముగా.

**91 వ పద్యము :-** తనువు = శరీరము ; దండ = దండము ; కమండలు = కమండలము ; ప్రభృతి = మొదలైనవి ; ధారులకున్ = ధరించువారికి (సన్న్యాసులకుఁ గూడ) ; కతిచిత్+మనోరథాలు = కొన్ని మనోరథములు (కోరికలు) ; ఒండు = ఒక్క.

**92 వ పద్యము :-** వయోజనుండు = ఎదిగిన మనుష్యుఁడు ; ఆంతర మందున్ = మనస్సులోపల ; దుః+కృతంబులన్ = పాపములను.

**93 వ పద్యము :-** నర-మానసంబునకున్ = మానవుని మనస్సునకు ; అజా = ఆఁడుమేఁక యొక్క ; గళ = మెడకున్న ; స్తనంబులకున్ = చన్నులకు ;

పూరకమ్మై = నిండుఁదనమును గల్పించునవి అయి ; బహుధా = పెక్కు (ఇతర) విధములైన ; బల+ఉత్కరంబు = శక్తిసామర్థ్యముల గుంపు ; అల వడకున్న = అబ్బనిచో ; కానన్ = కాఁబట్టి.

**94 వ పద్యము :-** పొలఁచు = కనిపించు/ తోఁచు ; శిరంబు మీఁదన్ = తల మీఁద ; తోరపున్ = అధికమ్మైన ; కలదో = ఉన్నదో ; సకలంబున్ = అంత యును ; త్యజించి = వదిలిపెట్టి ; ఆరయవచ్చు = కానవచ్చు (కనిపించు) ; ప్రేతునిన్ = చనిపోయినవానిని ; రయంబునన్ =వేగముగా ; కర్మ-దుః+ భారము = కర్మల యొక్క చెడ్డ బరువు ; భవత్+ఉపజ్ఞకె = నీ సహజ జ్ఞాన మునకే ; తెల్లము = స్పష్టము.

**95 వ పద్యము :-** కట్టడలోన్ = అదుపులో ; కల-యంత-కాలమున్ = ఉన్నంత కాలమున్ను ; నేలయున్- నింగిన్+కానరు = భూమి ఏదియో, ఆకాశమేదియో యెఱుఁగరు (క్రిందు-మీఁదులు చూడరు. ఉచ్చనీచములు పట్టించుకొనరని భావము) ; అవనీ-జనులు = భూమి మీఁది జనము ; ఆమునన్ = మదముతో ; కాల = యముని ; లులాయ = దున్నపోఁతు యొక్క ; కంఠగత = మెడలోని ; ఘంటిక = చిఱుగంటలు ; ఆమయ-లక్షణ+ఆకృతిన్ = రోగలక్షణముల రూపములో ; మ్రోయన్ = మ్రోఁగగా.

**96 వ పద్యము :-** పఠనలలోనె = పుస్తకములలోనే ; క్షమ = క్షమాగుణము ; పాటిలున్ = తటస్థించును ; వికార = వికృతమ్మైన ; విచారమయ = ఆలోచన లతో కూడుకొన్న ; హరములె = పట్టుదలలే ; ఏరికిన్ = ఎవటికి? ;



శఠతలన్ = ధూర్తత్వములను (దోషములను) ; ఓర్వన్+చాలు = సహింపఁ గల.

**97 వ పద్యము :-** గాసిలువారిన్ = శ్రమ/బాధపడువారిని ; ఇంకన్+కడున్ = ఇంకను ఎక్కువగా ; వాసిగన్ = చక్కగా ; లోక-ఖేదములు = లోకుల బాధ లను ; పాఁపన్ = పోఁగొట్టుట కొఱకై ; ఒనర్చిన = చేసిన ; ఏరుపాటులున్ = ఏర్పాటులు (వ్యవస్థలు) కూడ ; తద్దయున్ = మిక్కిలి ; అ-కారణ-దాతవు = ప్రత్యేక కారణము లేకయే అన్నియు ఇచ్చువాఁడవు ; ఆసర = ఆధారము/ ఆశ్రయము ; తత్+అన్యులకున్ = తన/ తనవారి కంటె వేఱైన ఇతరులకు ; ఇంచుక = కొంచెమ్మైనను.

**98 వ పద్యము :-** పథాలు = దారులు ; నీకు ; అసహాయులన్ = నిస్సహాయు లను *(కాని ఈ 'అసహాయ-నిస్సహాయ' శబ్దముల అర్థములు పూర్తిగా ఒకటి కావు)* ; విహ్వల = భీతి చెందిన ; పాయక = విడువక ; కావు = కాఁపా డుము ; ఊఁదెదన్ = పట్టుకొందును.

**99 వ పద్యము :-** ఆత్మికంబు = ఆధ్యాత్మికము ; ఉభయ = ఈ రెండు ; ఏక = ఒకటియే ; భవత్+దయా+అమృత+ఆలోకనన్ = నీ దయ అనెడి అమృతముతో కూడిన చూపుతో ; అ-రోగతయున్ = ఆరోగ్యమును కూడ ; ఘన = గొప్పవాఁడవైన.

**100 వ పద్యము :-** కనినన్ = చూడఁగా ; స్వయంకృత+ఆత్మకము = స్వయంకృతముల (తనకు తానే చేసికొన్న అపకారముల) స్వభావము గలవి ;

క్లేశములు = బాధలు ; ఉర్విన్ = భూమిపై ; మనుజ-కృత+ఏక = మానవులే కల్పించుకొన్నవి అయిన ; వనటల నుండి = బాధల నుండి ; అనవద్య = తప్పుపట్టరాని, లోపములెంచను వీలుకాని ; కృపా-నిధి! = దయకు నిధియైనవాఁడా!

**101 వ పద్యము :-** స్వఘాతకును = ఆత్మహత్యకు సైతము ; తారు = తాము ; అయినన్ = అయినప్పటికిని ; క్షుద్ర = అల్పమైన ; ప్రోవుము = కాఁపాడుము.

**102 వ పద్యము :-** నీరము = నీరు ; అనఁద+ఐనన్ = అసమర్థమైనచో ; ప్రతి+ఆహిక = ప్రతిదినమునకును సంబంధించిన ; ఆదర-శేముషిన్ = ఆదరము గల బుద్ధితో ; ఆలకించి = శ్రద్ధగా వినిపించుకొని ; ధారా-హితము = ధారగా (ధారాళముగా) మేలు ; ఆచరించు = చేయు ఏ హరిత్+అంతరంబున్ = వేఱు దిక్కేదియు (హరిత్ = దిక్కు).

**103 వ పద్యము :-** మనీషులున్ = మేధావులు కూడ ; పుట్టిన-నాటన్+గోలెన్ = పుట్టినప్పటి నుండియు ; పాటిలి = పాటించి ; శీఘ్ర+అవితులు = వెంటనే కాపాఁడఁబడినవారు ; త్వత్ = నీ యొక్క ; అగాధ= మేఱలేని ; సదా = ఎల్లప్పుడును ; భవత్ = నీ యొక్క.

**104 వ పద్యము :-** వెఱన్ = భయముతో ; ఆశ్రయించుటకున్ వెన్కను = ఆశ్రయించిన తరువాత కూడ ; యశస్కరము = కీర్తిని కలిగించునట్టిది ; ఈవు = నీవు ; పర-పరమ+అల్పభూతులము = చాల అల్పులమైనవారము ; అటుగానన్ = అందుచేత ; నీవు దక్క= నీవు తప్ప ; కృప సంధిలన్+చూడుము = దయ ఏర్పడఁగా చూడుము.



**105 వ పద్యము :-** పెడన్+పాఁపివేయుము = దూరముగా తొలఁగించివేయుము ; ఆకాశమున్+పోని = ఆకాశమువంటి ; ఈశుని కోటిలోన్ = ఈశ్వరకోటిలో ; ఇయ్యది = ఇదే.

***ఈశ్వరకోటి శబ్దము – అర్థ వివరణము :-*** *భగవంతునికి అత్యంత సన్నిహితులై శాశ్వతముగా ఆయన లోకములోనే నివాసముండి ఆయనను సేవించు భక్తులు ఈశ్వరకోటి అనఁబడెదరు. వీరు జన్మ లేని ముక్తజీవులే అయినను ఆయన భూలోకములో అవతారము ధరించినప్పుడు వీరు కూడ ఆయనతో పాటు ఆయన పరివారముగా జన్మించెదరు.*

**106 వ పద్యము :-** ఎదవెతలు = హృదయవేదనలు ; ఒక్కచోన్ = ఒక ప్రక్క ; కొలుపులు = ఉపాసనలు ; ఇంకొకచోన్ = ఇంకొక ప్రక్క ; ఇటు = ఈ విధముగా ; పదయుగము = పాదముల జంటను ; చిర-భక్తులకున్ = చాల కాలము నుండి భక్తులుగా ఉన్నవారికి ; పెఱవారికిన్ = (మఱియు) ఇతరులకును (మధ్య) ; ఎచ్చుగా = పెద్దగా ; బన్నము = అవమానము.

**107 వ పద్యము :-** అధికతన్ = ఆధిక్యమును ; అన్యుల మీఁదన్ = ఇతరుల మీఁద ; నశేష-లోక = లోకులందఱికిని ; సద్+విధమగు = ఉన్నటువంటి ; ధారణంబె = జీవితమునే ; మదిన్ = మనస్సులో ; ఒసంగి = ఇచ్చి ; వెసన్ = త్వరగా ; మన్గడన్ = జీవితమును.

**108 వ పద్యము :-** మనమునన్ = మనస్సులో ; ఉగ్ర-దండనలు = భయంకర మైన శిక్షలు ; దుర్విషహంబులు = తట్టుకొనరానివి.

**109 వ పద్యము :-** అహమును = అహంకారమును (నేను-నాది అను భావ ములను) ; వీడన్ = వదిలిపెట్టఁగా ; దేహిగాన్ = దేహమును ధరించినవాఁ డుగా ; అహరహము = ప్రతిదినమున్ను ; ఉండన్ = జీవించుచున్నప్పుడు ; ఎట్టులు+అది+ఔన్+అని = అది ఎట్లు జఱుగును అన్నది ; ఇహమునన్ = ఈ జీవితములోనే ; లంకె లేని = సంబంధము లేని ; పితృ-కృత్య-ఫలంబులె = తాతతండ్రుల కర్మఫలములే ; సోఁకన్ = అంటుకొనుచుండఁగా ; ఏము = మేము ; సస్పృహముగన్ = స్పృహలో ఉండి *(పక్షాంతరములో)* కోరికతో.

**110 వ పద్యము :-** ఘటించినన్ = చేసినచో ; ప్రాక్+నిగమ+ఉక్తములు = ప్రాచీన శాస్త్రములు చెప్పిన ; నిష్కృతుల్ = ప్రాయశ్చిత్తములు ; ఒనరింపన్+ చాలము+అయ! = చేయలేమయ్యా! ; ఈ యుగ+అంగముల్ = ఈ కలి యుగములోని మా మానవ శరీరములు ; నీ మహిత+ఆఖ్యన్ = గొప్పదైన నీ నామమును. హేలులము = అజ్ఞానపు ఆటలు ఆడుకొనువారము (హేల = ఆట) ; ఆర్ష-శాస్త్ర = ఋషులు రచించిన శాస్త్రములచే ; విహిత = విధింపఁబడిన ; ఈశ్వర-మార్గపు = ఆధ్యాత్మిక మార్గపు ; అక్కటికన్ = కరుణతో ; కను = చూడుము.

**111 వ పద్యము :-** బేలలము = ధైర్యము లేనివారము ; ఏము = మేము ; గేస్తులము = గృహస్థులము ; అపేత-సు-సత్త్వులము = గొప్ప శక్తిసామర్థ్య ములు లేనివారము ; ఉల్లమందునన్ = మనస్సులో ; భీతులును = భయ ములు మఱియు ; వేదుఱులున్ = వెఱ్ఱులు కూడ ; అజ్ఞతా- అజ్ఞానపు ; హేలులము = ఆటలు ఆడుకొనువారము (హేల=ఆట) ; ఆర్ష = ఋషులు రచించిన ; శాస్త్ర = శాస్త్రములచే ; విహిత = విధింపఁబడిన ; ఈశ్వర మార్గపు = ఆధ్యాత్మిక సంప్రదాయపు ; అక్కటికన్ = దయతో ; కను = చూడుము.



**112 వ పద్యము :-** అధికము+ఏనియున్ = ఎక్కువైనను ; కాఁక = సెగ (వేఁడిమి) ఎక్కినన్ = ఎక్కువైనను ; పంచతకున్ = మరణమునకు ;

**113 వ పద్యము :-** అన్వేషణము+ఆడన్ = వెదకుటకై ; సత్త్వములన్ = శక్తి సామర్థ్యములను ; ప్రేషణ+చేయుము = పంపివేయుము ; ఎప్పటికిన్ = శాశ్వతముగా ; నిః+శేషముగాన్ = సంపూర్ణముగా ; ప్రపూరితము+ చే యుము = నింపుము.

**114 వ పద్యము :-** సాహ్యకర = సహాయము చేయువారి యొక్కయు ; పోషక= పోషించువారి (యజమానుల) యొక్కయు ; ఆర్ష-కృతి-వర్గము = ఋషుల రచనల గుంపు.

**115 పద్యము :-** భార్గవీ-లోపములందున్ = సంపద లేని సందర్భములలో (భార్గవి = లక్ష్మీదేవి) ; విరోధి-మండల-వ్యాపనమందున్ = శత్రువుల సమూ హము పెఱిగిన సందర్భమునందు ; ఆఖరి ప్రయాణమునందును = మరణ సమయమునందు కూడ.

**16 వ పద్యము :-** నీ పదము+ఊఁదినందులకున్ = నీ పాదమును పట్టి

నందుకు ; ఈ లఘు-జీవుఁడు = ఈ చిన్న ప్రాణి ; నీదు కోవెలన్ = నీ గుడిలో; నీ కడన్ = నీ సన్నిధిలో ; దీప-మయూఖ-దీప్తుఁడయి = (నీకు వెలిఁగించిన) దీపముల కిరణములతో (తాను కూడ) వెలిఁగి ; ఎల్లఋన్ =అందఋన్ను ; మట్టగించు = త్రొక్కివేయు ; పెన్+తాపగన్ = పెద్ద మెట్టుగా ; త్వత్+ఆజ్ఞ = నీ ఆజ్ఞ ; అది+ఎల్లను = అదంతయు.

**117వ పద్యము** :- సత్యపు లోకమందలి = వాస్తవ ప్రపంచములోని ; సరణిన్ = మార్గములో.

**118 వ పద్యము** :- వార్ధిలోనన్ = సముద్రములో ; శతకోటుల పెట్టునన్ = వందల కోట్ల కొలఁది ; మురిపెపు = ముద్దువచ్చు ; స్వకీయము = స్వంతము ; సు-మనోహర+అర్థక = మంచి హృదయంగమమైన అర్థములు గల ; పద+అంచిత = పదములతో కూడిన ; సత్+కృతులన్ = మంచి కావ్యములను ; క్వాచితము = అరుదు (క్వచిత్తుగా ఉండునది) ; ఆరయన్ = పరిశీలింపఁగా.

**119 వ పద్యము** :- ఆస్థగన్ = ఆసక్తితో ; వత్సరమందున్ = సంవత్సరములో ; నిండన్ = పూర్తిగా ; గ్రంథస్థతన్+కన్న = గ్రంథరూపమును పొందిన ; స్వస్థతయున్ = ఆరోగ్యము కూడ ; స్వాస్థ్యములున్ = ఆస్తులు కూడ ; యశము = కీర్తి.

# అకారాది పద్యానుక్రమణిక

